కఙ్కణబన్ధ

# ఏకశ్లోకరామాయణమ్

శ్రీ గురు గణపతిభ్యాం నమః

వాగ్దేవతా తరుణ సత్కరుణా ముపాద్య
విద్యానవద్యతర హృద్య కవిత్వశాలీ।
వాసిష్ఠవంశ జననిర్నను కృష్ణమూర్తి
ర్వ్యాఖ్యాం కరోమి నిజ కంకణబన్ధ ముఖ్యామ్॥ 1

గౌరీ సర్వజ్ఞయోః పిత్రోః పదపాథోరుహోర్హృ దా।
నిరంతరాయ మిష్టాప్త్యై నిరంతర మహమ్ భజే॥ 2

నను కంకణ బన్ధ కృతిః కృతినా-మపినోసుకరాయ దివాకవిభిః।
కృమిభిర్ఘటి తాస్తు తథాపి కథా-క్రమ సంగ్రథి న శ్చకాస్తి భువి॥ 3

శ్రీరామ దివ్య చరితం ఖలు తత్కటాక్ష
ధారా ప్రవర్షణ విధా కలిత ప్రకర్షమ్।
హర్షం వహన్నహమకార్ష మమర్ష శూన్యే
సారజ్ఞ సంపదధికం కణమేవ సారమ్॥ 4

చతుష్షష్ట్యర్థ గుణన బన్ధో ద్వాత్రింశదక్షరః।
సతా మ్ముదే విజయతాం నితాంతమతి దుష్కరః॥ 5

ప్రాచేతసాది కవిరాజ విరాజమాన
సత్కేలి సింధు తతి సంగతి బన్ధురన్య।
శ్రీరామ కీర్తి భర భవ్య పయః పయోధేః
సేయం కృతి ర్భవతి కంకణ బన్ధ ఏవ॥ 6

ద్వాదశాంశాః ప్రథమతో ద్వితీయేతు త్రయోదశ
తృతీయే షట్ చతుర్థేస్యురేకాదశ తతో దశ
పంచమే ద్వాదశ తథా షష్ఠేకాణ్డే క్రమాత్కృతాః॥ 7



## బాలకాణ్డమ్

**అవతారిక:-** వాసిష్ఠ వంశజుడైన కృష్ణమూర్తి కంకణబన్ధ కావ్యారమ్భ శ్లోకమున శ్రీరాముని ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ నేతా దేవాలీనా మాశాధానాధీనానేకాలోకీ ।**
**మాస్థానాభాఖ్యా యోగీ శమ్ పాయాదేతం రామే రాజా॥** 1

**పదవిభాగము:-** నేతా-దేవాలీనామ్-ఆశాధానాధీనానేకాలోకీ-మాస్థానా భాఖ్యా యోగీ-శమ్-పాయాత్-ఏతమ్-రాః-మే-రాజా

**ప్రతిపదార్థము:-** ఆశాధానాధీనానేకాలోకీ-ఆశాధాన=ఆశలకాధారము (కంకణము)నకు, అధీన=లోబడిన, అనేక=అనేక (పదార్థ)ములను, ఆలోకీ=చూచు, మాస్థానాభాఖ్యాయోగీ-మా=లక్ష్మి యొక్క, స్థాన=చోటైన, భా=కాంతితో, ఆఖ్యా=ప్రసిద్ధితో, యోగీ=కూడిన, దేవాలీనామ్=దేవతల సమూహములయొక్క, నేతా=నాయకుడు (విష్ణువు), రాజా=రాజై, ఏతమ్=వీనిని (రచయితను), మే=నా యొక్క, రాః=ద్రవ్యములను, శమ్=సుఖమును, పాయాత్=కాపాడుగాక!

**తాత్పర్యము:-** ఈ కంకణము ఆశలకాధారమైనది. దీని బహు పదార్థములను చూచునట్టి లక్ష్మీదేవి యొక్క స్థానమైన కాంతి ప్రసిద్ధులతో కూడిన దేవతా సమూహ నాయకుడైన ప్రభువైన విష్ణువు నా యొక్క ద్రవ్యమును సుఖమును నన్నును కాపాడుగాక!

**వివరణము:-** తన కావ్యము తన ఆశల సిద్ధి యత్నమున బద్ధ కంకణము వంటిది. దాని వలన సంతోషించిన శ్రీరాముడు తనను తన ధవమును తన సుఖమును కాపాడవలెనను కవి ప్రార్థన మీ శ్లోకముననున్నది. అనుష్టుప్ఛందస్సునకు చెందిన విద్యున్మాలా వృత్తమున నీ శ్లోకమున నిబంధింపఁబడినది.

ప్రతిపాదముననున్న ఎనిమిది అక్షరములును గురువులుగా నుండుట విద్యున్మాలావృత్త లక్షణము. అనుష్టుప్ఛందః ప్రస్తారమున రెండువందల యేబది యాఱు వృత్తము లేర్పడును. సర్వ గురువైన ఈ వృత్తము వానిలో మొదటిది. ఆ మొదటి వృత్తమున ఈ కావ్యమందలి మొదటి శ్లోకము నిబంధింపఁబడినది.

ఈ మొదటి శ్లోకము యొక్క మొదటి అక్షరము మొదలు వరుసగా చివఱ చేర్చగా మొత్తము అనులోమముగా ముప్పది రెండు శ్లోకములుగా, ఆ తఱువాత చివఱి అక్షరము మొదలు వరుసగా చేర్చగా ముప్పది రెండు శ్లోకములు ఏర్పడును. ఈ విధముగా మొత్తము కావ్యము ముప్పది రెండు అక్షరములే అనులోమముగా విలోమముగా నిబన్ధింపఁబడగా ఈ కావ్యము కంకణబన్ధ రామాయణమైనది.

**అవతారిక:-** పై శ్లోకమునందలి మొదటి అక్షరమును చివఱచేర్చినచో నీ క్రింది శ్లోక మేర్పడును. సీతారాముల అవతరణ మీ శ్లోకమున చెప్పబడు చున్నది.

**శ్లో॥ తా దేవాలీనా మాశాధానాధీనానేకాలోకీ మా।**
**స్థానాభాఖ్యా యోగీ శంపాయాదేతం రామేరాజానే॥ 2**

**పదవిభాగము:-** తాః-దేవాలీనామ్, ఆశాః-ధాః-న-అధీనానేకాః-లోకీ-మా-స్థానభాఖ్యా యోగీ-శంపా-ఆయాత్-ఏతమ్-రామ-ఇరాజానే.

**ప్రతిపదార్థము:-** ఇరాజానే=భూమి పతివైన, రామ=ఓ రామా, దేవాలీనామ్ =దేవతా సమూహముల యొక్క, తాః=ఆ, ఆశాః=(ప్రాచ్యాది)దిక్కులు, ధాః =రక్షకములుగా, న(ఇతి)న=లేకుండెననుట లేకుండెను (అనగా ఉండెను), అధీనానేకాః-అధీ=బుద్ధిహీనుడు (రావణుడు), ఇనః=ప్రభువుగాగల, అనేకాః= అనేకులు(ప్రజలు)గలవై యుండెను, యః=ఎవడైతే, అగీ=సర్పవంతుడు (విష్ణువు), స్థానాభాఖ్యా=స్వస్థానమున కాంతి ప్రసిద్ధులుగల, లోకీ=లోకవంతుడు, శంపా=మెరుపు తీగ, మా=లక్ష్మి, ఏతమ్=ఈ లోకమును గూర్చి, ఆయాత్= వచ్చెను.

**తాత్పర్యము:-** దేవతా సమూహముగల ఆ దిక్కులు రక్షకుడు లేవనుట లేనివై యుండెను. బుద్ధిహీనుడు (రావణుడు) ప్రభువుగా గలవై యుండెను. సర్పశాయి లోక ప్రభువునైన విష్ణువు, కాంతి ప్రసిద్ధులు గల లక్ష్మియు ఈ లోకమునకు వచ్చిరి.

**వివరణము:-** దేవ సమూహముల యొక్క దిక్కులు రక్షక హీనములు



కావు, కాని బుద్ధిహీనుడైన రావణుడు ప్రభువుగా గలవై యుండెను. అగీ అనగా అగము గలవాడు. అగము అనగా సర్పము. అది శయనముగ గలవాడు. లోకీ అనగా లోకము (స్వాధీనముగా) గలవాడునునైన విష్ణువు మరియు భూనభము లలో కాంతి ప్రసిద్ధులు గల లక్ష్మియు నీ లోకమున నవతరించిరి.

**అవతారిక:-** మొదటి శ్లోకమునందలి మొదటి రెండక్షరములు చివఱకు చేర్చుట వలనగాని, పై శ్లోకమునందలి మొదటి అక్షరమును చివఱ చేర్చుట వలనగాని ఈ శ్లోక మేర్పడును. దశరథుని పుత్రజన్మోత్సవ మిందు చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ దేవాలీనామాశాధానాధీనానేకాలోకీ మా।**
**స్థానా భాఖ్యా యోగీ శం పాయాదేతం రామే రాజా నేతా॥ 3**

**పదవిభాగము:-** దేవాలీనామాశాధానాధీనానేకాలోకీ-మాస్థా-న-అభాఖ్యా యోగీ-శమ్-ప-ఆయాత్-ఏతమ్-రామే-రాజా-నేతా.

**ప్రతిపదార్థము:-**దేవాలీనామాశాధానాధీనానే కాలోకీ, దేవ=దేవతల యొక్క, అలి=సమూహము యొక్క, ఇన=ప్రభువు(ఇంద్రుని)యొక్క, ఆమ=అపక్వమైన, ఆశా=ఆశ యొక్క, ధా=పోషణము నందు, అనాధీన=అధీనము కాకపోవుటలేని, అనేక=అధికమైన, ఆలోకీ=ప్రతాపముగల,మాస్థా=లక్ష్మీనివాసమైన, అభా= అకాంతి యొక్క, అఖ్యా=అకీర్తి యొక్క, అయోగీ=సంబంధము కలవాడుకాని, నేతా=నాయకుడైన, రాజా=రాజు(దశరథుడు), రామే=రాముడు(కొడుకు)కాగా, ఏతమ్=ఈ, శమ్=సుఖమును, ఆయాత్=పొందెను.

**తాత్పర్యము:-** ఇంద్రుని అపక్వమైన ఆశ యొక్క పోషణము అధీనముగా గల అధిక ప్రతాపముగల నాయకుడైన దశరథరాజు రాముడు కొడుకుగా జన్మించినందుకు (పుత్రజన్మ) సుఖమును పొందెను.

**వివరణము:-** శ్రీరామ జన్మజ సంతోషము దశరథునిలో కలుగుట ఈ శ్లోకమున చెప్పఁబడినది. రాబోవు శ్లోకములన్నియు పూర్వ శ్లోకములలోని మొదటి అక్షరమును శ్లోకము చివఱ చేర్చగా నేర్పడునట్టివే. ఇట్లు కావ్య

మంతయు ఆద్యంతములు గుర్తింపరాని కంకణబన్ధమున నొదిగి యుండునట్లు రచింపఁబడినది. నేనెఱింగినంత వఱకు కంకణబన్ధమున రచింపఁబడిన కావ్య మేదియులేదు.

**అవతారిక:-** మొదటి మూడక్షరముల చివఱచేర్చుటచే గాని, పై శ్లోకము లోని మొదటి అక్షరమును చివఱ చేర్చుటచేగాని ఈ శ్లోకము ఏర్పడును. విశ్వామిత్రాగమన మిందు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వాలీనామా శాధానాధీనానేకాలోకీ మాస్థానా।**
**భాఖ్యా యోగీ శంపాయాదేతం రామే రాజా నేతాదే॥ 4**

**పదవిభాగము:-** వాలీనామాశాధానాధీనానేలోకీమాస్థానా-భాఖ్యాయోగీ-శంప-ఆయాత్-ఏతం-రామే-రాజా-నేతా-ఆదే.

**ప్రతిపదార్థము:-** భాఖ్యా శంప=కీర్తి ప్రసిద్ధులు ఆభరణములుగా కల, సుఖమును పాలించువాడా!, అ=విష్ణూ!, ఏతమ్=ఈతని(దశరథుని)దగ్గఱకు, వాలీ(రీ)=వరసమూహముగల, రాజా=రాజైన, యోగీ=యోగి(విశ్వామిత్రుడు), నామాశాధానాధీనానేకాలోకీ-నామ=పేరు(కీర్తి లేక ప్రసిద్ధి)యందలి, ఆశా=ఆశ చేత, ఆధాన=(అగ్ని) ఆధానమున, అధీనః=ఆసక్తి గల, అనేకాలోకీ-బహు(రక్షణ) దృష్టి గలవాడై, ఆదే=ఆది యందు(మొదట)జన్మించిన, రామే=శ్రీరాముని యందు, మాస్థానా-మా=బుద్ధియొక్క, ఆస్థానా=ఆస్థగలవాడై, నేతా=ముందు వచ్చువాడై, ఆయాత్=వచ్చెను.

**తాత్పర్యము:-** విశ్వామిత్రుని ఆగమనము.

**వివరణము:-** ఆదే అనుపదమును మొదలువాడా అను అర్థమున సంబుద్ధిగా కూడ గ్రహింపవచ్చును. భాఖ్యాశంప, అ, అను పదములు భగవంతుని సంబోధనములుగా గాని, కవిని పోషించు ప్రభువును బోధించునవి గా గాని గ్రహింపవలెను. విష్ణువాచకమైన అ అను సంబోధనము ప్రభువును బోధించుపక్షమున విష్ణుతుల్యుడా! అను అర్థము నిచ్చును. రాబోవు శ్లోకముల లోని సంబోధనముల అర్థము లిట్లే గ్రహింపవలెను.



**అవతారిక:-** పై శ్లోకమున విశ్వామిత్రాగమనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున, సుబాహ్వాది రాక్షసులను వధించి విశ్వామిత్రుని యాగమును రక్షించుట వలన శ్రీరామునకు కలిగిన కీర్తి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ లీనామాశాధా నాధీనానేకాలోకీ మాస్థా నాభా।**
**ఖ్యా యోగేశమ్ పాయాదేతం రామేరా జానే తా దేవా॥ 5**

**పదవిభాగము:-** లీనామాశా-ఆధా-నాధీ-ఇనానేకాలోకీ-మాస్థా-న-ఆభా-ఖ్యా-యోగీశమ్-ప-ఆయాత్-ఏతమ్-రామ-ఇరా-జానే-తాః -దేవ-అ.

**ప్రతిపదార్థము:-** ప=రక్షకుడవైన, అ=ఓ విష్ణూ, దేవ=రాజా, ఇనానేకాలోకీ= సూర్యునేకముగా(అనేక పర్యాయములు)చూచు(తాపసుడైన) విశ్వామిత్రుడు, లీనామాశాధానాధీ-లీన=దాగియున్న, ఆమాశ=పచ్చి, లేక అపవిత్రమైన అలక్ష్మీ కరమైన(మాంసాదికమైన)ఆహారమును తిను సుబాహుమారీచాదిరాక్షసుల యొక్క, అధా=అపోషణమును, నాధీ=(చంపుమని)కోరిన, మాస్థా=లక్ష్మితో కూడినయత్నము(ఫలించలేదు), న ఆభా=కాంతిలేదు, ఏతమ్=ఈ, యోగీశమ్= యోగీశుని(విశ్వామిత్రుని), ఖ్యా=(యాగమును రక్షించెనను) కీర్తి, ఆయాత్= చేరెను, తాః=అట్టి, రామేరాః-రామే=రాముని(కీర్తించు), ఇరాః=వాక్కులను, జానే =ఎఱుగుదును.

**తాత్పర్యము:-** సూర్యునేక పర్యాయములు చూచుచు తపముచేయు విశ్వామిత్రుడు మారీచ్యాది రాక్షసుల అపోషణమును అనగా నాశమును యాచించగా శ్రీరాముడు పచ్చి మాంసమును తిను మారీచ్యాది రాక్షసులను దాగుకొన్న వారినిగా లేక చచ్చినవారినిగా చేసినాడు. అనునట్టి శ్రీరాముని (కీర్తించు) వాక్కులు యోగీశుడైన విశ్వామిత్రునికి వినఁబడెను.

**వివరణము:-** ఆమమనగా పచ్చిది. ఆమాశులనగా పచ్చిమాంసమును తిను రాక్షసులు, అని లేదా అమ అనగా అలక్ష్మి. అలక్ష్మికి సంబంధించిన అనగా అమంగళకరమైన ఆశలు కలవారైన రాక్షసులు అనియు అమా, ఆమాశబ్దమునకు అర్థములను చెప్పవచ్చును. విశ్వామిత్రుడు తన యాగమునకు విఘ్నమును

కలిగించు రాక్షసుల సంహరించుమని శ్రీరాముని కోరగా ఆతడు ఆ పని నిర్వహించెను. అప్పుడు ఆతడాపని చేసెనని ఆ రాముని కీర్తించు వాక్కులు విశ్వామిత్రుని చెవులలో ప్రవేశించెను. ఇది ఈ శ్లోకములోని కథాంశము.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామకృత విశ్వామిత్ర యాగరక్షణము సూచింపఁబడినది. ఈ శ్లోకమున సీతోర్మిలాదులను పెండ్లాడుటకై దశరథ పుత్రులందఱి యొక్క రాక సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ నా మాశాధానాధీనానేకాలోకీ మాస్థానాభా ఖ్యా।**
**యోగీశం పాయాదేతం రామేరాజా నేతా దేవాలీ॥ 6**

**పదవిభాగము:-** నా-మాశాధానాధీనానేకాలోకీ-మాస్థానాభా-ఖ్యా-యోగీ-ఈశమ్-ప-ఆయాత్-ఏతమ్-రామ-ఇరాజ-ఆనేతా-దేవాలీ.

**ప్రతిపదార్థము:-** ప=రక్షకుడా!, దేవాలీ(రీ)=దేవతలను(ధ్యానముతో) పొందువారు (ఋషులు) గల, యోగీ=యోగి (విశ్వామిత్రుడు), మాశాధానాధీ నానేకాలోకీ-మా=లక్ష్మి (సీత) యొక్క, ఆశా=అశన(భోజన)స్థానము(విదేహపురి) లోని, ఆధాన=యజ్ఞము, అధీన=అధీనముగా గల, అనేక=లక్ష్మీవంతుని (జనకుని), ఆలోకీ=చూచువాడై, మాస్థానాభాఖ్యా-మాస్థాన=లక్ష్మి (సీత)యొక్క స్థానము (విదేహపురి) నందు, ఆభా=కీర్తి, ఖ్యా= సుఖమునం దిచ్చు గలవానితో కూడి, ఇరాజ=భూమి యొక్క బరువు కల వానిని, ఆనేతా=చేర్చువాడై, ఏతమ్= ఈ, ఈశమ్=ప్రభువును(జనకుని), ఆయాత్ =చేరెను.

**తాత్పర్యము:-** ఋషిబృందయుతుడైన విశ్వామిత్రుడు సీత యొక్క ఆశలకు (అశనాదిభోగములకు) స్థానమై విదేహపురి యందలి జనకుని చూచువాడై భరతాదులను రప్పించువాడై యజ్ఞాధీనుడైన విదేహపురీ ప్రభువైన జనకుని చేరెను.

**వివరణము:-** ఈ అనగా లక్ష్మి. న+ఈ=నే అనగా లక్ష్మిలేనివాడు. స్వార్థమున కప్రత్యయము చేరగా నేకశబ్ద మేర్పడును. నేకుడు (అలక్ష్మీకుడు) కానివాడు అనేకుడు అనగా లక్ష్మీవంతుడు. సంపన్నుడు అని భావము. జనకునకై



ఈ శబ్దము ప్రయోగింపఁబడినది. మాస్థానాభాఖ్యా=మా లక్ష్మీ అనగా సీత. ఆమె యొక్క స్థానము, విదేహ నగరము. అందు శివుని విల్లు విఱిచిన కాంతి ఆభా శబ్దవాచ్యము. సీతావివాహ జనిత సుఖము. ఖ శబ్ద వాచ్యము. అట్టి కాంతి సుఖములు కోరువాడు మాస్థానాభాఖీ శ్రీరాముడు అనగా మాస్థానాభాఖి శబ్దమునకు తృతీయా విభక్తి చేర్చఁబడగా మాస్థానాభాఖ్యా అను శబ్ద మేర్పడును. దానికి శ్రీరామునితో అని అర్థము.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామలక్ష్మణ విశ్వామిత్రుల విదేహపురియైన మిథిలను గూర్చిన ప్రయాణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ ప్రయాణ సమయమున నడక శ్రమ తెలియకుండుటకై చేయబడిన వారి సంభాషణము సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ మాశాధానాధీనానేకాలోకీ మాస్థానా భాఖ్యా యో।**
**గీ శమ్ పాయాదే తం రామేరాజా నేతా దేవాలీనా॥ 7**

**పదవిభాగము:-** మాశాధానాధీనానేకాలోకీ-మాస్థానాభాఖ్యాయ-ఉ-గీ-శంప-అయాదే-తమ్-రామేరాజాః-నేతా-దేవాలీ-ఈ-ఇనా.

**ప్రతిపదార్థము:-** ఉ శంప=ఓ సుఖమును పాలించువాడా!, భాఖ్యాయ= కాంతి ప్రసిద్ధులనొందువాడా, అయాదే=దైవము ఆదిగా గలవాడా!, మాశాధానాధీ నానేకాలోకీ-మా=బుద్ధి యొక్క, ఆశ=స్థానమున, అధాన= ఉంచుట, అధీన= అధీనములైన, అనేకా=అనేక(పదార్థ)ములను, ఆలోకీ=చూచు, మాస్థానాగీ=లక్ష్మి (సీత)యొక్క స్థానమును(మిథిల)చేరబోవు శ్రీరాముడు, తమ్=విశ్వామిత్రుని జనకుని, రామేరాజాః-రామ=మనోహరములైన, ఇరాజ=వాక్క లందుకలిగిన, ఆః =హేతువులు గలవాడై, నేతా=చేరువాడు కాగలడు, దేవాలీ=దేవ సమూహము, ఈనా-ఈ=వాక్కులందు, ఇనా=యజమానురాలైనది.

**తాత్పర్యము:-** ఎదుట కనఁబడు గంగాది దృశ్యములు బుద్ధిలో నిలుపు కొన్న, మిథిలను చేరబోవు విశ్వామిత్రడు, జనకుడు పలుకు మనోహరములైన వాక్కులు, శ్రీరాముడు దారి గడచి మిథిల చేరగలడు అను ఇత్యాదులైన వాక్కులకు దేవతా సమూహము యాజమాన్యము వహించినది.

**వివరణము:-** మార్గ(శ్రమ తెలియకుండునట్లు విశ్వామి(త్రుడు చెప్పుకథలను వినుచు ఎదుట కనఁబడు ఆ(శమమెవరిది అని గౌతమా(శమమును గూర్చి (ప్రశ్నించుచు గంగాదినదుల సౌందర్యమును చూచి బుద్ధి తదాయత్తముకాగా రాముడు మిథిల చేరును అను మనోహర వాక్కులు విశ్వామి(త్ర, జనకులకు తమకుగల దివ్యశక్తుల ద్వారమున వినఁబడుచుండెను.

**అవతారిక:-** పై శ్లోకమున గౌతమా(శమ విషయమైన శ్రీరామ (ప్రశ్నము సూచింపఁబడినది. ఈ శ్లోకమున గౌతముని భార్యయైన అహల్య నుద్ధరించుటకై శ్రీరాముడా ఆ(శమము చేరుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శాధానాధీనా నేకాలోకీ మా స్థానాభాఖ్యా యోగీ।**
**శంపాయాదేతం రామేరాజానేతా దేవాలీనామా॥ 8**

**పదవిభాగము:-** శాధానాధీనానేకాలః-అకీ-మాస్థానాభాఖ్యాయోగీ-శంప-ఆయాత్-ఏతమ్-రామే-రాజా-ఆనేతా దేవాలీ-నామా.

**(ప్రతిపదార్థము:-** (య(త్ర=ఎచట) శంప=సుఖమును పాలించువాడా, శాధానాధీనానేకాల(ర)ః-అనేకాల(ర)ః=అనేకములైన అరలు(అంచులు)గల వ(జ్రము గలవాడు(ఇం(ద్రుడు), శాధానాధీన=సుఖమునిచ్చువాడు అధీనముగా గల, మాస్థానాభాఖ్యా యోగీ-మా=లక్ష్మి యొక్క, స్థాన=స్థానము పద్మోదరము యొక్క, ఆభా=కాంతివంటి కాంతిగల, ఆఖ్యా=(అహల్యాయై జార అను) నామముతో, యోగీ=యోగము కలవాడు, అకీ=పాపి లేక దుఃఖియునైన వాడాయెనో, దేవాలీనామా-దేవాలీ=దేవతా సమూహము యొక్క, ఇన=(ప్ర(భువు (ఇం(ద్రుని)యొక్క, అమా=అలక్ష్మి(అహల్య) (ఉండెనో), ఏతమ్=దీని(ఈ (ప్రదేశమును)ని, రామేరాజానేతా-రామ+ఈ+ఇరాజ=భూలక్ష్మి, శేషుడు (లక్ష్మణుడు) అను=రామలక్ష్మణ రాజ కుమారులను, ఆనేతా=తెచ్చువాడై (విశ్వామి(త్రుడు), ఆయాత్=వచ్చెను.

**తాత్పర్యము:-** సుఖస్థాను(విష్ణువు)నకు అధీనుడైన అనేకములైన అంచులుగల వ(జ్రాయుధమును ధరించిన ఇం(ద్రుడు అహల్యాజారుడను (ప్రసిద్ధ నామము పొందినాడు. దుఃఖియునైనట్టి ఇం(ద్రుడు జారుడుగా గల అహల్య నివసించు (ప్రదేశమునకు విశ్వామి(త్రుడు రామలక్ష్మణులతో కూడి వచ్చెను.



**వివరణము:-** ఇం(ద్రుని అహల్యా జారత్వము (శుతిసిద్ధము. అహల్య గౌతమ శాపమున గౌతమా(శమమున నివసించియుండగా శ్రీరామలక్ష్మణులతో విశ్వామి(త్రుడు అచటికి వచ్చెనను కథాంశ మిందుఁజెప్పఁబడినది. ఇరా అనగా భూమి. అది ఎవని తలయందు జ=ఉన్నదో ఆతడు ఇరాజుడు అనగా శేషుడు. లేక ఈ అను శబ్దము లక్ష్మీవాచకము స్థిరలక్ష్మి రూపమైన భూమిని కూడ బోధించును. అప్పుడు రాజ శబ్దము రామ లక్ష్మణ వాచకముగా నేర్పడును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామలక్ష్మణవిశ్వామి(త్రుల గౌతమా(శమ (ప్రవేశము చెప్పబడినది. ఈ శ్లోకమున శ్రీరామపాదపరాగస్పర్శచే శాపవిముక్త యైన అహల్య భర్తయైన గౌతముని చేరుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధానా ధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీశమ్।**
**పాయాదే తం రామేరా జానేతా దేవాలీనామాశా॥ 9**

**పదవిభాగము:-**ధానాధీనానేకాలోకీ-మాస్థానాభాఖ్యా యోగీశమ్-ప-ఆయాదే -ఏతం-రామేరాజానా-ఇతా-దేవా లీనామాశా.

**(ప్రతిపదార్థము:-** ప=రక్షకుడా!, ఆయాదే=శుభవహావిధికాదియైనవాడా!, దేవాలీనా=ఇం(ద్రుని యందలి, ఆమ=అపక్వమైన, ఆశా=ఆశగలది(అహల్య), రామేరాజానా-రామ=రామునియొక్క(పాదములందలి),ఇరా=భూమి (పరాగము) యందు, జ=పుట్టిన, అనా=(ప్రాణముకలదై, ధానాధీనానేకాలోకీ-ధాన=స్థానమున, అధీన= దాగియుండి స్వాధీనుడైన, అనేక=అనేకములైన, ఆలోకి= కన్నులు కలవాడు (ఇం(ద్రుడు)గలదై, ఈమాస్థానాభాఖ్యా యోగీశమ్- ఈ=వాణి, మా= లక్ష్మి, ఆః=కాలి(ఈ ముగ్గురి)యందు, ఆస్థ=ఆసక్తి గలవారు ((బ్రహ్మవిష్ణు మహేశ్వరులు), అనాభాఖ్యాయోగీశమ్-న+ఆభా=నాభాః=కాంతిలేని వారు అట్టి వారు కాని వారు, అనాభాః=అనగా కాంతులు, ఆఖ్యా=పేరులు వాని యందు యోగ్=ధ్యానము గలవారికి (మునులకు), ఈశమ్=(శేష్ఠుడైన వాని (గౌతముని), ఇతా=పొందినదాయెను.

**తాత్పర్యము:-** గౌతమా(శమమున గూఢముగా నున్న అహల్య యందు

అపక్వమైన అనగా ఆశాస్త్రీయమైన ఆశగలవాడై ఇంద్రుడు గౌతమ శాపమున అనేక నేత్రములు గలవాడాయెను. గౌతమ శాపదగ్ధమైన అహల్య శ్రీరామపాద పరాగమున ప్రాణముపోసికొన్నదై తిరిగి బ్రహ్మవిష్ణుమహేశ్వరుల ధ్యానించు యోగులలో శ్రేష్ఠుడైన గౌతముని చేరుకొన్నది.

**వివరణము:-** గౌతమ శాపమున ఇంద్రుడు, అహల్య శపింపఁబడుట చెప్ప బడినది. గౌతమశాపమున ఇంద్రుడు సహస్రాక్షుడు (సహస్రయోనులు తన యందున్నవని దుఃఖించువాడు)గా శపింపఁబడెను. ఆతని పుంస్త్వవైఫల్యము మేష వృషణప్రాప్తి ఇత్యాది కథాంగము లిచట అనుసంధేయములు. గౌతమ శాపమున అదృశ్య భస్మశాయిని నిరాహారగానున్న అహల్య శాపవిముక్త యగుటయు చెప్పఁ బడినది.

**అవతారిక:-** పై శ్లోకమున అహల్యేంద్రుల శాపవిముక్తులు సూచింపఁ బడినవి. ఈ శ్లోకమున శ్రీరాముడు శివధనుర్భంగముచేయుట చెప్పఁబడు చున్నది.

**శ్లో॥ నాధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీశమ్ పా।**
**యాదే తం రామేరాజానేతా దేవాలీనా మాశాధా॥ 10**

**పదవిభాగము:-** నాధీనానేకాలోకీ-మాస్థానా భాఖ్యా యోగీశమ్-పా యాదే-తమ్-రామా-ఇరాజా-న-ఇతా-దేవాలీనామ్-ఆశా-అధా.

**ప్రతిపదార్థము:-** యాదే=యా అనగా(ప్రజా)రక్షణము. దానికి ఆది యైనవాడా!, ప=రక్షకుడా!, అ=ఓ విష్ణూ!, (విష్ణువుతో సమానుడా!) రామేరాజా (రామా+ఇరాజా)=అందమైన భూ పుత్రి(సీత), అనా=నా అనగా పరితాపము అది లేనిదై, నాధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీశమ్-నాధి=యాచకులకు, ఇన=ప్రభువైన, అనేకాలోకీ=అనేకములైన (మూడు) కన్నులు కలవాని(శివుని) యొక్క, మాస్థానాభా=లక్ష్మియొక్క నిలకడతో శోభించువాని(విష్ణువు)తోడి కలయిక చేత, ఆఖ్యా=అంతట వ్యాపించిన కీర్తి కల(విష్ణురూప బాణముకల), అయోగి=ఇనుపబాణముల సంబంధము లేని శివధనువుకల (దుర్ఘటమైన శివ ధనువు నెక్కుపెట్టు ప్రయత్నమున దానిని విఱచు సామర్థ్యముతో కూడిన,)



ఈశమ్=రాముని(భర్తగా), ఇతా=పొందినది, దేవాలీనామ్=రాజసమూహముల యొక్క, ఆశా=ఆశ, అధా=పోషణరహితము(ఆయెను).

**తాత్పర్యము:-** పరితాపములేని సీత శివుని ధనువును విఱచుట చేత రాముని పెండ్లాడెను. పిమ్మట రాముడు రావణుని చంపగలడను దేవతల ఆశను పోషించుచు శివధనువును విఱవలేక చతికిలబడిన రాజసమూహముల ఆశలకు అపోషణము కల్గించును.

**వివరణము:-** శివధనుర్భంగానంతరము సీత రాముని భర్తగా పొందిన వృత్తాంత మిందు చెప్పఁబడినది. అయోగి అను పదము అ అనగా విష్ణువు ఆ విష్ణువు అనుబాణముతో యోగముకలవాడు అనునర్థమున శివుని బోధించును అయః అగీ అను విభాగము ననుసరించి అయః అనగా ఉక్కు దానివంటి అగము అనగా పర్వతము (మేరు పర్వతము) ధనుస్సుగా గల శివుని కూడా బోధించును. మరొక విధముగా అయోగి పదము (బాణ)సంబంధములేని అను అర్థమును అనగా జనకుని దగ్గఱ శివధనువు మాత్రమున్నది. దానికి బాణ యోగము లేదు అను అర్థమును బోధించును. అనగా ధనుస్సును మాత్రము బోధించును.

**అవతారిక:-** శివధనుర్భంగమున కలిగిన ఇతరరాజుల పరాభవము సూచింపఁబడినది. ఈ శ్లోకమున భరతశత్రుఘ్నులతోగూడి దశరథుని రాక సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ ధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యాయోగీశమ్ పాయా।**
**దేతం రామేరాజానేతా దేవాలీనా మాశాధానా॥ 11**

**పదవిభాగము:-** ధీన-అనేకాలోకే మాస్థానాభాఖ్యా యోగీశమ్-పాయ- అ-దేతమ్-రామేరా-అజానా-ఇతా-దేవాలీనామే-ఆశా-ఆధానా.

**ప్రతిపదార్థము:-** ధీన(ధీ+ఇన)=బుద్ధికి ప్రభువైనవాడా, పాయ(ప+అయ) =రక్షణను పొందినవాడా!, రక్షకుడా, అ=విష్ణూ!, (విష్ణుతుల్యుడా), అనేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీశమ్-అనేక=అనేకులు, ఒకటికాని అనగా ముగ్గురు (బ్రహ్మవిష్ణురుద్రుల భార్యలు), ఆలోకి=చూచువారుకల, ఈ స్థాన=కాంతి

యుక్తములైన ఆ స్థానము(దేవసభ)లందు, ఆభాఖ్యాయోగి=అంతట ప్రకాశించు కీర్తితో కూడిన, ఈశమ్=ప్రభువైన, దేతమ్=(దా+ఇతమ్)=శివధనుః ఖండనము చే ప్రసిద్ధుడైనవాని (రాముని), అజానా=జనసమూహోతీతమైన, రామేరా=రామ+ఇరా=(పరశు)రాముని వాక్కు, ఇతా=పొందబడినది, దేవాలీనామ్-దేవ సమూహముల యొక్క, ఆశా=ఆశ, ఆధానా=గొప్ప పోషణముగలది (ఆయెను).

**తాత్పర్యము:-** బుద్ధికి ప్రభుడవైన రక్షకుడవైన ఓ విష్ణుతుల్య ప్రభూ! బ్రహ్మవిష్ణురుద్ర భార్యలవంటి ముగ్గురు మరదంద్రతో కూడిన తమ్ములతో కూడిన రాముని పొందిన పరశురాముని వాక్కు తిరస్కరింపఁబడినదై రాబోవు రాముని రాక్షసజయమును సూచించునదైనదను దేవతల ఆశకు పోషకమయ్యెను.

**వివరణము:-** పరశురామ గర్వభంగ కథ ఇందు సూచింపఁబడినది. దానికన్న ముందు మొత్తము సీత, ఊర్మిలా, మాండవి, శ్రుతకీర్తి అను నలుగురు కన్యలనువరుసగా రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు పెండ్లాడినారను వృత్తాంతము కూడా చెప్పఁబడినది. ఊర్మిలామాండవీ శ్రుతకీర్తులు ముగ్గుఱు మూర్తుల భార్యలైన లక్ష్మీ, పార్వతి, సరస్వతీ తుల్యులని చెప్పఁబడినది. దానిచేత ముగ్గుఱు మూర్తులకన్న గొప్పవాఁడు రాముడు అని శ్రీరాముని పర బ్రహ్మత్వము వ్యంజింప జేయఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున సీతాదుల రామాదుల కల్యాణముల అనంతరము అయోధ్యకు పోవు సమయమున జరిగిన పరశురామ గర్వభంగము సూచింపఁబడినది. ఈ శ్లోకమున వారు అయోధ్యకు చేరి అందు సుఖముగా నుండుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ నానేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీ శమ్ పాయాదే।**
**తం రామే రాజానేతా దేవాలీనా మాశా ధానాధీ॥ 12**

**పదవిభాగము:-** నానేకాలోకీ-మాస్థానాభాఖ్యాయోగీ-శమ్-ప-(ఏ+ఆదే) అయాదే -తమ్-రామేరాజానేతా-దేవ-అలీనామ్-ఆశా-ధానాధీ.



**ప్రతిపదార్థము:-** ప=రక్షకుడా!, ఏ=గౌరవమునందు, ఆదే=మొదటి వాడా!, మాస్థాన=లక్ష్మీనివాసుడా!, తమ్=దానిని(రామవృత్తాంతమును వినుము) ఆభాఖ్యాయోగీ=అంతట ప్రకాశముకల (పరశురామ జయలబ్ధమైన) కీర్తిగలవాడై, అరీ(లీ)నామ్=శత్రువుల యొక్క, ఆశాధానాధీ=ఆశల అపోషణమును కోరు, నానేకాలోకీ=అముఖ్య దర్శనము లేని, రామేరాజానేతా-రామ=అందమైన, ఇరాజా =సీతయొక్క, నేతా-భర్త(రాముడు), శమ్=సుఖముగా, ఆయాత్=(అయోధ్యను) పొందెను, (లేక) శమ్=సుఖమును(కూడా) ఆయాత్=పొందెను.

**తాత్పర్యము:-** ఓ రక్షకుడా! మొదటివాడా!, పరశురాముని జయించి నందువలన కలిగిన కీర్తి గలవాడై శత్రువుల ఆశల అపోషణమును గోరు ఐశ్వర్యమును పొందునట్టి జనులచే కోరఁబడిన ముఖ్యదర్శనము కల అనగా జనులచే ముఖ్యముగా దర్శనీయుడైన సీతాపతి సుఖముగా అయోధ్యను పొందెను. లేక అయోధ్యను సుఖమును కూడ పొందెను.

**వివరణము:-** ఇందు సీతాసహితుడై శ్రీరాముడు అయోధ్యను చేరి సుఖముగా కాలము గడుపు వృత్తాంతము చెప్పఁబడినది. శ్రీరాముని బాల్య బ్రహ్మచర్యము అనంతరము గార్హస్థ్యజీవితారంభ సుఖము శం శబ్దము చేత వ్యంగ్యము. ఏక శబ్దము ముఖ్యార్థకము న+ఏక=అనేక అనగా అ ముఖ్యము అలోకశబ్దమునకు దర్శనము లేని అని అర్థము అనేకాలోకీ శబ్దము రాముని దర్శనము అముఖ్యము కాదు అనగా అతడు ముఖ్యముగా దర్శనీయుడు అను అర్థమును బోధించును. *

## అయోధ్యాకాణ్డము

అవతారిక:- పై శ్లోకమున సపత్నీకులైన శ్రీరామాదుల ద్వాదశవర్షసుఖ జీవనము సూచింపఁబడినది. ఈ శ్లోకమున దశరథుని శ్రీరామయౌవరాజ్య పట్టాభిషేకవాంఛ సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ నేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీశమ్ పాయాదే తమ్।**
**రామే రాజానేతా దేవాలీనా మాశాధానాధీనా॥ 13**

**పదవిభాగము:-** నా-ఇకాలోకీ-మాస్థానాభాఖ్యాయోగీ-శమ్-పాయాదే-తమ్-రామేరాజానేతా-దేవాలీనామ్-ఆశా-ఆధానాధీనా.

**ప్రతిపదార్థము:-** పాయాదే=(పా+ఆయ+ఆదే)-పా=(ప్రజా) రక్షణమున (వలన లభించిన), ఆయ=ఆదాయ(ద్రవ్యలాభ)మునకును, ఆదే=మొదటి వాడనైన రాజా!, ఇకాలోకీ-ఇ=మన్మథుని, క=సూర్యుని, ఆలోకీ=సౌందర్యప్రభలు కల, రామేరాజానేతా=(రామ+ఇరాజా+నేతా)=అందమైన సీత యొక్క నాయకుడైన, మాస్థానాభాఖ్యాయోగీ-మాస్థాన=(రాజ్య) లక్ష్మీస్థానము (రాజసభ) యందు, ఆభాఖ్యా=ప్రతాప ప్రసిద్ధులతో, యోగీ=సంబంధముగల, నా= పురుషు(రాము)డు, తమ్=ఆ, ఈశమ్=ప్రభువు(దశరథ మహారాజు)ను పొందెను, దేవాలీనామ్=రాజమండపముల యొక్క, ఆశా=ఆశ, ఆధానాధీనా= (రాముని యందు) ఉంచుటకు అధీనమైయున్నది.

**తాత్పర్యము:-** ఓ రాజా! మన్మథునివంటి సౌందర్యము. సూర్యుని వంటి ప్రభ కలిగిన, రాజ్యలక్ష్మీ స్థానమనదగిన రాజ సభ యందు ప్రతాప ప్రసిద్ధులతో వెలుగొందు, అందమైన సీతాదేవికి నాయకుడు శ్రీరాముడు అయోధ్యా నగరమున రాజసభలో విరాజిల్లుచున్న దశరథ మహారాజును చేరియుండెను. రాజుల ఆశలును తదధీనములై యుండెను.

**వివరణము:-** అయోధ్యాకాండారంభ శ్లోకమున దశరథరాజుతో పాటు రాముడు విరాజిల్లియున్నాడను వస్తు నిర్దేశాత్మకమైన మంగళాచరణము చేయఁ బడినది. రాముడు రాజు కావలెనని దశరథ మహారాజు తన మనసున చింతించు



చున్నాడను వస్తువీ శ్లోకమున వ్యంగ్యము. ఆ సభలోని సామంతరాజులు కూడ రాముడు యువరాజ పట్టాభిషేకము త్వరగా జరుగవలెనని ఆశించుచున్నా రనుటయు ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది.

పాయాదేతమ్ అను పదబన్ధమును, ప+ఆయాత్+ఏతమ్ అనువిధముగా విభజించి, ప=ఓ రక్షకుడా! అని ఏతమ్=వీనిని(దశరథుని),ఆయాత్(శ్రీరాముడు) చేరెను అన్నట్లు అర్థము చెప్పుకొనవచ్చును. అప్పుడు క్రియాధ్యాహారము యొక్క ఆవశ్యకత తొలగిపోవును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరాముని యౌవరాజ్య పట్టాభిషేక ప్రయత్నా రంభము సూచింపఁబడినది. ఈ శ్లోకమున దేవతల ఇచ్చను గురించి మంథరా కైకేయీలి తద్విఘ్న యత్నము సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ కాలోకీ మాస్థానాభాఖ్యా యోగీ శంపా యాదేతం రా।**
**మేరాజానేతా దేవాలీ నామాశాధానాధీనానే॥ 14**

**పదవిభాగము:-**కాలః-అకీ-మాస్థానాభాఖ్యాయోగీ-శంపా-ఆయాత్-ఏ-తమ్ -ర-అ-మేరా-అజానేతా-దేవాలీనామాశాధానాధీనా.

**ప్రతిపదార్థము:-** ఏ=మన్మథుడా!(మన్మథతుల్యుడా!), ర=అగ్నీ!, (అగ్ని తుల్యుడా), అ=విష్ణూ! (విష్ణుతుల్యుడా!), మాస్థానాభాఖ్యా యోగీ శంపా-మా =లక్ష్మియొక్క, స్థానా=స్థానముగలదాని(మంథర)చే, ఆభాఖ్యా=కీర్తిప్రసిద్ధులచే, యోగి=కూడిన, ఈ=వాక్కులు అను, శంపా=మెరుపులు గల, యా=ఎవతె, (కైకేయి), సా=ఆమె, దేవాలీనామాశాధానాధీనా-దేవాలీ=దేవసమూహముల యొక్క, నామ=పేర్లను, ఆశా=ఆశలను, ఆధాన=ఉండుటచే, అధీనా=వశురాలై, అజానేతా (అ+జాన+ఇతా)=జన సంబంధమైన గమనము (మర్యాద) లేనిది (కైకేయి), మేరా=నిషేధవాక్కు గలది ఆయెను, అకీ=దుఃఖము కల, కాలః =కాలము, ఆయాత్=వచ్చినది.

**తాత్పర్యము:-** ఓ మన్మథుని వంటి సౌందర్యము అగ్నివంటి తేజము విష్ణువు వంటి విక్రమము కలవాడా!, లక్ష్మి యొక్క స్థానము గల మంథర

తోడను, కీర్తిప్రసిద్ధుల తోడను, యోగముగల వాక్కులు అను మెరపులచే దేవతల పేర్లు మరియు వారి ఆశల ఆధానమునకు అధీనురాలై అనగా పేరొందిన దేవతల ఆశలచే ప్రేరితురాలై రామాభిషేకము వలదు అను నిషేధ వాక్కు (మా+ఇరా=మేరా) గలదయ్యెను. దుఃఖకాలము వచ్చినది గదా!

**వివరణము:-** మాస్థానాభాఖ్యాయోగీశంపా అను విశేషణము రామ పట్టాభిషేక వార్త విని సంతోషించినట్టిది. మంచిదిగా ప్రసిద్ధిపొందిన కైకేయి మంథర వాక్కుల మెఱుపులచే ప్రభావితురాలైనదను అర్థము తెలుపును. ఈ శ్లోకమున దేవతలే రామపట్టాభిషేక విఘ్నమునకై ప్రేరితులైనందునసే మంథర మరియు కైకేయి జనమర్యాదా దూరముగా వ్యవహరించిరను అర్థము కొంచెము గూఢముగా చెప్పఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున దేవతల శ్రీరామయౌవరాజ్యపట్టాభిషేక భంగ వాంఛ సూచింపఁబడినది. ఈ శ్లోకమున కైకేయి శ్రీరామ పట్టాభిషేకమున కంగీకరింపక పోవుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ లోకీ మాస్థానాభాఖ్యా యోగీ శమ్ పాయాదేతం రామే।**
**రాజా నేతా దేవాలీనా మాశాధానా ధీనానేకా॥ 15**

**పదవిభాగము:-** లోకీ మాస్థానాభాఖ్యాయః-అగీ-శమ్-పాయాత్-ఏతమ్-రామే-రాజా-న-ఇతా-దేవాలీనామ్-ఆశాధానాధీనా-అనేకా.

**ప్రతిపదార్థము:-** మాస్థానాభాఖ్యాయః-మాస్థాన=లక్ష్మికి స్థానమైన వారి యందు, ఆభాఖ్యాః=ప్రతాప ప్రసిద్ధుల, ఆయః=లాభముగల, అగీ=(వంశమున కూటస్థుడుగా) సూర్యుడు గల, రాజా=రాజు(దశరథుడు), రామే=రాముడు, పాయాదే(పా+ఆయ+ఆదే)=రక్షణ లాభమును తీసుకొనువాడు కాగా!, శమ్= ఆనందమును, ఏతమ్=(ఆ+ఇతమ్)=మిక్కిలి ప్రసిద్ధిని, లోకీ=చూచువాఁడు ఆయెను, దేవాలీనామ్=రాజభార్యలలో, అనేకా=ఇతరముకాని లేక స్వీయమైన, ఆలోకీ=శోభగల, ఇనా=రాజు భార్య(కైకేయి), ఆశాధానాధీనా=(రాజ్యలక్ష్మి యందలి) ఆశయొక్క పోషణమునకు వశురాలై, నేతా=అంగీకరించనిది ఆయెను, కుమారుని రాజ్య లాభ మందలి ఆశను నిలుపుకొనుటకు వశురాలై, న ఇతా=అంగీకరించునది కానిది ఆయెను.



**తాత్పర్యము:-** రాజ్యలక్ష్మీ సంపన్నులలో అధిక ప్రతాప ప్రసిద్ధములు కల సూర్యవంశీయుడైన దశరథ మహారాజు రాముడు ప్రజారక్షణ లాభమును పొందువాడు కాగలడని ఆనందమును పొందెను. కీర్తిని పొందువాడును ఆయెను. కాని దానికి అనితర సాధారణ శోభగల అనగా అతిసుందరియైన ఆతని భార్య అంగీకరించలేదు.

**వివరణము:-** శ్రీరాముడు యువరాజ పట్టాభిషిక్తుడు కాగలడు అను దశరథుని ఆనందమును కైకేయి పై శ్లోకమందలి తన నిషేధవాక్కుచే నశింపఁ జేసెనను వస్తువీ శ్లోకమున చెప్పఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామ యౌవరాజ్యపట్టాభిషేక భంగము చెప్పబడినది. ఈ శ్లోకమున కైకేయి యిచ్చానుగుణముగ శ్రీరాముడు సీతా లక్ష్మణసహితుడై వనవాసము నారంభించుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కీ మాస్థానాభాఖ్యాయోగీ శంపాయాదేతం రామేరా।**
**జానేతా దేవాలీనామాశాధానాధీనానేకాలో॥ 16**

**పదవిభాగము:-** కీ-మాస్థానాభాఖ్యాయః-అగీ-శంపా-ఆయాత్-ఏతమ్-రామా-ఈరా-జానేతా-దేవాలీనామాశాధానాధీనానేకాలః.

**ప్రతిపదార్థము:-** కీ=సుఖముకల, మాస్థానాభాఖ్యాయః=లక్ష్మికి స్థానమైన వాఁడు, ప్రతాప ప్రసిద్ధుల యొక్క లాభము కలవాడు (విష్ణ్వవతార రాముడు), అగీ=వృక్షములు (లేక) పర్వతములుగల (వాడై) (వనవాసియై), ఆయాత్= (వనమునకు) వచ్చెను, శంపా=మెఱుపుతీగ (వంటిది) యైన, ఈరా=లక్ష్మి (శోభ)ని ఇచ్చు (శోభావతియైన), రామా=స్త్రీ (సీత), జానేతా=(జాన+ఇతా)= జనులకు సంబంధించిన జ్ఞానము లేక గతి గలదై, ఏతమ్=వీనిని (రాముని అనుసరించి), ఆయాత్=వచ్చినది ఆయెను, దేవాలీనామాశాధానాధీనానే కాలః -దేవాలీ=దేవసమూహముల యొక్క, నామ=పేర్ల, ఆశా=ఆశలకు, అధీనా (అధీన)=అధీనుడై(అధీనయై), అనేకాలః (అనేక+అలః) అనేకములైన ప్రత్యాహారములు గలవాడు (పతంజలిగా అవతరించిన శేషుని అవతారమైన లక్ష్మణుడు), ఆయాత్=వచ్చెను.

**తాత్పర్యము:-**ఇప్పటి వఱకు సుఖముగానున్న రాముడు కైకేయి వచనాను సారము వనవాసార్థమై సీతాలక్ష్మణులతో కూడి వనమునకు వచ్చెను.

**వివరణము:-** అడవికి వచ్చినను ఆనందస్వరూప విష్ణ్వవతారమైన రాము నకు వనవాసము కూడ ఆనందముగానే ఉండెనని కీ శబ్దము వ్యంజించు చున్నది. శంపా శబ్దము సీత యొక్క మెఱుపు తీగ తోడి పోలికతోపాటు శ్రీరాముని నీలమేఘతుల్యతను కూడ వ్యంజించుచున్నది. సీతారాము లిరువురును దేవతల పేర్లను ఆశలను వనవాసము ద్వారా నిలుపుచున్నారని దేవాలీనామాశాధానాధీనా అను విశేషణము బోధించుచున్నది.

**అవతారిక:-**పై శ్లోకమున వనవాసమునకై పోవు శ్రీరాముని సీతాలక్ష్మణులు అనుగమించుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున కైకేయి భరత యౌవరాజ్య పట్టాభిషేకయత్నము కైకేయీతరభార్యల యొక్క దశరథుని యొక్కయు ఆశల భంగము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మాస్థానాభాఖ్యాయోగీశమ్ పాయాదేతం రామే రాజా।**
**నేతా దేవాలీనా మాశా ధానాధీనా నేకాలోకీ॥ 17**

**పదవిభాగము:-** మాస్థాన-ఆభాఖ్యాయోగీశమ్-పాయాత్-ఏతమ్-రామే-రాజా-దేవాలీనామ్-న ఇతాః-ఆశాః-ధానాధీనా-నేకాలోకీ.

**ప్రతిపదార్థము:-** రామే=రామునియందు, మాస్థా-మా=(రాజ్య) లక్ష్మి యందలి, ఆస్థా=ఆసక్తి, ఆభాఖ్యా యోగీశమ్-ప్రతాపప్రసిద్ధుల యోగము గల ప్రభువును, పా=(పితృవాక్య) పరిపాలనము(వలన), ఆయాత్= వచ్చినది, ఏతమ్(ఆ+ఇతమ్)=ప్రసిద్ధి, ఆయాత్=చేరెను, రాజా=రాజు (దశరథుడు), దేవాలీనామ్=రాజభార్యల యొక్క, ఆశాః=ఆశలు, న ఇతాః= పొందబడినవి (ఫలించినవి)కాలేదు, ధానాధీనా=రాజ్యపరిపాలమునకు వశురాలైనది (కైకేయి), అనేకాలోకీ (అనేకాలోకీ+ఈ)=అనేకాలోచనల వాక్కులు గలదై యుండెను.

**తాత్పర్యము:-** శ్రీరాముని యందు రాజ్యలక్ష్మ్యాసక్తి లేకుండెను. పితృవాక్య పాలనమునకై అడవికేగెను. ప్రతాపముగల ఆ రామ ప్రభువును పితృవాక్య పాలకుడను ప్రసిద్ధి ఆశ్రయించెను. దశరథ మహారాజు యొక్క కైకేయీతర



భార్యల ఆశలు విఫలములయ్యెను. భరతుని రాజ్యపాలనమును గూర్చిన పెక్కు ఆలోచనలను వాక్కుల ద్వారా మంథరాది పరిచారికలతో సంభాషించుచుండెను.

**వివరణము:-** కౌసల్యాది రాజభార్యల రామయౌవరాజ్య పట్టాభిషేకాశ, కైకేయి యొక్క భరత రాజ్య పట్టాభిషేకాశయు ఇతర భార్యల రామ పరిపాలితులు కావలెనను ఆశయు విఫలము లయ్యెను, అని ఆశాః అను పదము లోని బహువచనముచే సూచింపఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరాముని యౌవరాజ్య పట్టాభిషిక్తుని చేయవలెనను దశరథుని ఆశయొక్క భంగము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సీతాసహితుడైన శ్రీరాముని వనాగమనముచేత దేవతలకు కల్గిన రావణవినాశ చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్థానాభాఖ్యా యోగీ శంపాయాదేతం రామేరాజానే।**
**తా దేవాలీనామాశా ధానాధీనానేకాలోకీ మా॥ 18**

**పదవిభాగము:-** స్థానాభాఖ్యా యోగీ-శంపా-ఆయాత్-ఏతమ్-రామా-ఇరాజా-అనే-తాః-దేవాలీనామ్-ఆశాః-ధానాధీనా-అనేకాలోకీ-మా.

**ప్రతిపదార్థము:-** అనే=(అని శబ్దము యొక్క సంబుద్ధి), ఇ=మన్మథుడు (మన్మథవికారము) లేని ఓ రాజా, స్థానాభాఖ్యా యోగీ శంపా(స్థానాభాఖ్యా యోగి -ఈ-శంపా)-స్థాన=నిలుకడగా, ఆభాఖ్యా=కాంతి ప్రసిద్ధుల యొక్క, యోగి= యోగముకల, ఈ=లక్ష్మి, శంపా=మెఱుపుతీగ (వంటిది) యునైన, రామా= అందగత్తెయైన, ఇరాజా=భూజాత (సీత), ఏతమ్=వీనిని (రాముని), ఆయాత్= చేరెను, తాః=ఆ, దేవాలీనామ్=దేవ సమూహముల యొక్క, ఆశాః=ఆశలు, ధానాధీనాః-ధా=పోషణమునందు, అనాధీనాః=(న+న+అధీనాః)=అధీనములు అయ్యెను, మా=లక్ష్మి (సీత), ఈకాలోకీ (ఈక+ఆలోకి+ఈ)-ఈకా= సంపదను (స్వార్థకప్రత్యయాంతము), ఆలోకి=చూచు, ఈ=వాక్కుకలది అయ్యెను.

**తాత్పర్యము:-** ఓ మన్మథ వికారము లేని రాజా! కాంతి ప్రసిద్ధిగల స్థిరస్థానమైన లక్ష్మివంటిది. మెఱుపుతీగ వంటిదియునైన సీతాదేవి రాము

ననుసరించి అడవికి పోగా దేవసమూహముల 'రావణు డీమెను చూచి అపహరించగా రాముడు వానిని చంపగల' డను ఆశలు పోషింపఁబడినవయ్యెను. ఎందుకనగా సీత లక్ష్మి. విష్ణువునకు అనపాయుని. రావణుడపహరించక మానడు. అపహరింపఁబడినను ఆమె వాని అధీనమునందెక్కువ కాలముండదు. విష్ణ్వవతార రామునామె చేరునని ఆమెను చూచిన వారి కనిపించుచుండెను.

**వివరణము:-** సీతారాముల లక్ష్మీనారాయణావతారత్వ మీ శ్లోకమున నిరూపింపఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున దేవతల ఆశ ఫలించునని సూచింపఁబడినది. ఈ శ్లోకమున శ్రీరాముని చిత్రకూట పర్వత ప్రాప్తి దశరథుని స్వర్గప్రాప్తియు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నాభాఖ్యాయోగీశం పాయా దేతం రామే రాజానేతా।**
**దేవాలీనామాశాధానాధీనానేకాలోకీ మాస్థా॥** **20**

**పదవిభాగము:-** నాభాఖ్యాయః-అగీశమ్-పాయాత్-ఏతమ్-రామే-రాజానేతా -దేవాలీనామాశా-ఆధా-న-అధీనానే కాలోకీ మాస్థా.

**ప్రతిపదార్థము:-** నాభాఖ్యాయః (న+అ+భాఖ్యాయః)=కాంతిగాని, ప్రసిద్ధి గాని, శుభావహవిధిగాని లేనివాడు కాని (అధికతర కాంతి విఖ్యాతి శుభములు గలవాడు), రామేరాజానేతా-రామా=సీత యొక్క, ఇరా=వాక్కులందు లేక భూమి యందు పుట్టిన, అ=గౌరవము (భారము)(భూ భారము)గల (శేషుని అవతార మైన) వాని (లక్ష్మణుని)కిని, నేతా=నాయకు(రాము)డు, ఏతమ్=ఈ, అగీశమ్= పర్వతనాయకు(చిత్రకూటము)ని, ఆయాత్=పొందెను, దేవాలీనామాశా-దేవ= రాజుల యొక్క, ఆలీ=వరుసయొక్క, ఇన=ప్రభువు(దశరథుని)యొక్క, ఆమ= అపక్వమైన, ఆశా=కోరిక, ఆధా=సంపూర్ణపోషణముగలది, న=కాలేదు, మాస్థా= (రాజ్య)లక్ష్మికి స్థాన భూతు(దశరథు)డు, అధీనానేకాలోకీ-అధీన=అధీశ్వరుడైన, అనేకాలోకీ=అనేకములైన కన్నులు గలవాడు (ఇంద్రుడు) (స్వర్గమున కేగినవాడు) ఆయెను.



**తాత్పర్యము:-** అధిక కాంతి విఖ్యాతి శుభములు గల శ్రీరాముడు సీతా లక్ష్మణులతో చిత్రకూటమును చేరెను. రామ యౌవరాజ్యపట్టాభిషేక వాంఛ నెరవేరకుండగానే దశరథుడు స్వర్గమున కేగెను.

**వివరణము:-** రాముడు చిత్రకూటమున కేగుట. దశరథుడు స్వర్గమున కేగుట అను రెండు కథాంశములు ఈ శ్లోకమున చెప్పఁబడినవి.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామసీతాలక్ష్మణులు చిత్రకూటముచేరుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున శ్రీరాము నయోధ్యకుగొనిపోవుటకై చతురంగబల సహితుడైన భరతుని చిత్రకూట ప్రాప్తి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ భాఖ్యాయోగీ శంపాయాదేతం రామేరాజానేతాదే।**
**వాలీనామాశాధానాధీనానేకాలోకీ మాస్థానా॥** **20**

**పదవిభాగము:-** భాఖ్యాయోగీ-శంప-ఆయాత్-ఏతమ్-రామే రాజానేతా-ఆత్-ఏ-వాలీనామాశాధానాధీనానేకాలోకీ-మాస్థా-న-అ.

**ప్రతిపదార్థము:-** శంప=సుఖమును పాలించువాఁడా, అ=విష్ణుతుల్యుఁడా, ఏ=ఇంద్రతుల్యుఁడా!(రాజా!), భాఖ్యాయోగీ(భ+ఆఖ్యాయోగీ)=భకారముతో పేరునందు యోగము కలవాడు (భరతుడు), వాలీనామాశాధానాధీనానేకాలోకీ-వాలి=(తోకలు గల) గుఱ్ఱముల యొక్కయు, ఏనుగుల యొక్కయు, ఇన= ప్రభువుల (రౌతుల మావటీంద్ర) యొక్క, అమా=మితిలేని, ఆశా=దిక్కు లందు, ఆధాన=ఉంచుట యందు, అధీన=స్వాధీనుల(అధికారుల)చేత, అనేక =అధికమైన, ఆలోకీ=ప్రతాపముగలవారు గలవాఁడై, ఆత్=గౌరవము వలన, రామేరాజానేతా-రామ=రాముని యొక్క, ఇరాజా=సీత యొక్క, ఇరాజ= లక్ష్మణుని యొక్క, ఆనేతా=తీసుకొనిపోవు (ఇచ్ఛగల) వాఁడై, ఏతమ్=దీనిని (చిత్రకూటమును), ఆయాత్=చేరెను.

**తాత్పర్యము:-** భరతుడు శ్రీరాముని యందలి గౌరవమున శ్రీరాముని సీతాలక్ష్మణులతో తిరిగి అయోధ్యకు తీసుకొనిపోవు ఇచ్ఛతో ఏనుగులు, గుఱ్ఱములు మొదలగు చతురంగ బలములతో దిక్కులందు తన ప్రతాపమును వెల్లడించుచు చిత్రకూటమునకు చేరెను.

**వివరణము:-** భరతుడు చిత్రకూటమును చేరుటకు ముందే తన చతురంగ బలమును దూరముగా దిక్కులలో నిలిపి తన ప్రతాపమును శ్రీరామునకు వెల్లడించ నిష్టములేనివాడైనను ఇతరులకు మాత్ర మాతని ప్రతాపము వెల్లడియగుచునేయుండెనను అర్థమును వాలీనామాశాధానాధీనానే కాలోకీ అనుసమాసము నందలి మాశాధీన పదములు వెల్లడించుచున్నవి. శ్రీరాముడు రాజు కావలెనను కోరికతో చతురంగబలములతో సూరేగించుచు కాబోవురాజైన రాముని కొనిపోవుటకే వానిని భరతుడు వెంటనిడుకొని వచ్చెననియు పై సమాసము తెలుపుచున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున భరతుడు చిత్రకూటమునకు వచ్చుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున భరతునిచే తన రాజ్యపాలనాశక్తత రామునకు తెలుపఁబడుచున్నది.

**శ్లో॥ ఖ్యాయోగీశం పాయాదేతం రామేరాజానే తా దేవా।**
**లీనా మాశా ధా నాధీనానేకాలోకీ మాస్థానాభా॥** 21

**పదవిభాగము:-** ఖ్యాయోగీశమ్-పాయాత్-ఏతమ్-రామ-ఇరాజానే-తాః-దేవ-అలీనాః-మాశా-ధా-న-అధీనా-అనేకాలోకీ-మాస్థానాభా

**ప్రతిపదార్థము:-** భాఖ్యాయోగీ=(పూర్వశ్లోకానువృత్తము) కాంతికీర్తి యోగము గలవాడు (భరతుడు), పాయాత్=(పా+అయాత్)=శుభవిధి నుండి (విడచి), ఏతమ్=వచ్చిన, ఖ్యాయోగీశమ్=కీర్తియోగులలో శ్రేష్ఠుని (శ్రీరాముని), తాః=అవి తండ్రికాలమున ప్రసిద్ధములైన, మాశాః=(రాజ్య)లక్ష్మికి సంబంధించిన ఆశలు, లీనాః=దాగిపోయినవి, ధా=ప్రజాపోషణము, న+అధీనా=(నాకు) అధీనమైనది కాదు, స్థానాభా=(స్వ)స్థానము(అయోధ్య) యొక్క కాంతి, అనేకాలోకీ-అనేకాలోకీ+ఈ=అనేకములైన ప్రతాపవంతుల, శోభలు గలది.

**తాత్పర్యము:-** ఓ దేవా! విష్ణుతుల్యుడా! రామ! రాజా! చిత్రకూటగతుడైన రాముని తండ్రిగారి కాలమున ప్రసిద్ధములైన రాజ్యలక్ష్మికి సంబంధించిన ఆశలు దాగిపోయినవి కాగా అయోధ్యాపురకాంతి అనేకులైన ప్రతాపవంతుల శోభలతో కూడినది అని భరతుడు పలికెను.



**వివరణము:-** ప్రజాపోషణము నాకు అధీనమైనది కాదు అనుటకు తండ్రిగారిదాకా ప్రతాపవంతులైన మహారాజుల పాలనమున వర్ధిల్లిన అయోధ్యారాజ్య పరిపాలనము చేయగల ప్రతాపము నాకు లేదు అనునది హేతువు.

శ్రీరామునకు దశరథుడు యౌవరాజ్య పట్టాభిషేకము అను శుభావహవిధి నిశ్చయించియుండెను. పితృాజ్ఞాపరిపాలనావ్యాజమున ఆ రాజ్య పాలనమున విరక్తుడైన రాముడు చిత్రకూటమునకు వచ్చియుండెను. (తండ్రిగారికి కూడ రాముడు పట్టాభిషిక్తుడై రాజ్యపాలనము చేయవలెననియే యుండెనని) తెలుపుటకై భరతుడు పలికెను.

**అవతారిక:-** పై శ్లోకమున భరతుడు శ్రీరాముని రాజ్య భారము స్వీకరింపవలెనని ప్రార్థించుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున రామునిచే తదభ్యర్థనము తిరస్కరింపఁబడుచున్నది.

**శ్లో॥ యోగీ శంపాయాదే తం రామేరాజానే తా దేవాలీ।**
**నామాశాధానాధీనానేకాలోకీ మా స్థానాభాఖ్యా॥** 22

**పదవిభాగము:-** యోగీ-శంప-అయాదే-తమ్-రామే-ఇరా-ఆజానే-తా-దేవాలీ-నామాశాధానాధీన-అనే-అ-కాలః-ఆకీ-మా-స్థానాభాఖ్యా.

**ప్రతిపదార్థము:-** నామాశాధానాధీన-నామ=కీర్తియందు, ఆశా=ఆశ యొక్క, ఆధాన=ఉంచుటయందు, అధీన=అధీనమైనవాఁడా!, అనే=మదన (వికార) రహితుడా!, శంపాయాదే-శంప= సుఖమును పాలించు, ఆయ= శుభావహవిధి గలవారిలో, ఆదే=మొదటివాఁడా!, రామ=మనోహరుడా, యోగీ= ముని వేషధారియైన రాముడు, రా=ద్రవ్యలక్ష్మి, ఆజానేతా-ఆజ= అజపుత్రుడైన దశరథుని నుండి, న+ఇతా=పొందఁబడని, ఇరా=భూమియు, దేవాలీ=సకలరాజ సమూహమును, అనేనాః=పాపముగలది, అకాలః=కాలము గలది కాదు, మాస్థానాభాఖ్యా-మాస్థాన=రాజ్యలక్ష్మికి (స్వ) స్థానమున (అయోధ్య యందు), అభా= ప్రకాశించని, ఆఖ్యా=కీర్తియు, మా=వద్దు(అని), తమ్=ఆ భరతుని గూర్చి (పలికెను).

**తాత్పర్యము:-** కీర్త్యాశనుంచుట యందు అధీనమైనవాఁడా, మదన వికార

రహితుడా, మెఱపుల వంటి శుభావహవిధులు కలవారిలో మొదటివాడా! భరతా! మునివేషధారినైన నాకు ధనముగాని, తండ్రి-ఈయని భూమిగాని సకల రాజ సమూహముగాని, పాపముగాని, అకాలమున వచ్చు రాజ్యము కాని స్వస్థానమైన అయోధ్యయందు ప్రకాశించని కీర్తిగాని వద్దు అని మునివేషధారి యైన రాముడు పలికెను.

**వివరణము:-** అరణ్యావాసము పదునాలుగేండ్ల కాలము నాకు రాజ్యప్రాప్తి యోగ్యము కాదు. కావున అకాలము వద్దు అను వాక్యము అకాలమున రాజ్యప్రాప్తి వద్దు అను అర్థమును బోధించును. అకీ శబ్దము అకాలమున రాజ్యము స్వీకరించిన పాపమున దుఃఖము కలుగునని బోధించును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరాముడు తానయోధ్యకు రాననుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున భరతునే రాజ్యభారము వహింపుమని శ్రీరామునాదేశము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ గీ శంపాయాదే తం రామేరాజానేతా దేవాలీనా।**
**మాశాధానాధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యాయో॥ 23**

**పదవిభాగము:-** గీ-శంపాయాదే-తమ్-రామేరాజానేతా-దేవాలీన-అ-మాశాధానా ధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యా-అయ-ఉ.

**ప్రతిపదార్థము:-** శంపాయాదే=సుఖమును పాలించు శుభావహవిధులు గలవారిలో మొదటి వాడా!, ఉ=ఓ, అ=విష్ణూ!, గీ=(కీర్తి)గానముగల, దేవాలీన=దేవసమూహమునకు ప్రభువైనవాడా!, రామేరాజానేతా=సీతకు భూమికిని ప్రభువైనవాడు, మాశాధానాధీనానేకాలోకీ-మా=రాజలక్ష్మి యొక్క, ఆశా=దిక్కు (స్థానము కోసలరాజ్యము) యొక్క, ఆధాన=(పదునాలుగేండ్ల కాలము) ఉండుట యందు, అధీన=అధీనమైన, అనేక=అనేక పర్యాయములు, ఆలోకీ=చూచు, మాస్థానాభాఖ్యా-మాస్థాన=లక్ష్మీస్థానుల (సకల దిగ్రాజుల) యందు, ఆభా=కాంతిగల, ఆఖ్యా=కీర్తిగలవాఁడా, అయ=పొమ్ము, (అని) తమ్=అతనిని (భరతుని) గూర్చి (పలికెను).

**తాత్పర్యము:-** సుఖహేతువులైన శుభావహవిధులు కలవారిలో మొదటి



వాడా!, ఓ విష్ణూ, సర్వజనులచే గానము చేయఁబడు కీర్తిగల, సీతాభూపతియైన రాముడు రాజలక్ష్మికి దిక్కైన కోసల రాజ్యమును పదునాలుగేండ్ల కాలము కాపాడు భారమును పొంది, రాముని విరహము వలన కలిగిన దుఃఖము కల వాడై అనేక స్థలములలో వెనుకకు తిరిగి మాటిమాటికి చూచుచున్న భరతునితో, సకలదిగ్రాజ్యాధిపతులందు అధికమైన కీర్తి గలవాడవై పొమ్ము, అని పలికెను.

**వివరణము:-** ఈ శ్లోకమున రాముడు భరతునితో తండ్రి గారికి సత్య పాలననిష్ఠ ఉన్నందున దానిని కాపాడు సుద్దేశముతో భరతుడా! నీవే పదునాలుగేండ్ల కాలము కోసల రాజలక్ష్మిని పాలించవలెనని చెప్పెను. అట్లు చేసినప్పుడే తండ్రిగారు పరలోకమున సుఖముగా నుండగలడని, అట్లు చేసిననే నీకును కీర్తి లభించునని చెప్పుట, శ్రీరాముని పితృవాక్య పరిపాలన నిష్ఠను తెలుపును. ఈ శ్లోకమున 1, 3 పాదములలో ప్రాసము పాటింపఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున తండ్రి యాదేశము ననుసరించి నీవే రాజ్య భారము వహించిన కీర్తివంతుడవగుదువను శ్రీరామాదేశము చెప్పబడినది. ఈ శ్లోకమున అయోధ్యకు శ్రీరాముని పాదుకలు తీసికొని భరతుడు పోవుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శంపాయాదేతం రామేరాజానేతా దేవాలీనామా।**
**శాధానాధీనానేకాలోకీ మాస్థా నా భాఖ్యాయోగీ॥ 24**

**పదవిభాగము:-** శంప-ఆయాత్-ఏతమ్-రామేరా-అజానేతా-దేవాలీ-నామా -శాధానాధీనేకాలః-అకీ-మాస్థా-నా-భాఖ్యాయోగీ.

**ప్రతిపదార్థము:-** అజానేతా-అజా+న+ఇతా=మాయచే పొందఁబడని, దేవాలీ=దేవతలకు సఖీప్రాయమైన, రామేరా=(రామ+ఇరా)=రాముని వాక్కు, ఏతమ్=వీనిని(భరతుని), శంపా=సుఖమును కలిగించునదై, ఆయాత్=వచ్చెను, భాఖ్యాయోగీ=కాంతి కీర్తుల యోగముగల, నా=నరుడు (భరతుడు), శాధానాధీనానేకాలః-శ=సుఖము యొక్క, ఆధాన=ఉంచుటయందు, అధీ=అధికమైన బుద్ధి (ఇచ్ఛ) లేని, ఇన=ప్రభువైన, అనేక=అనేకులను, ఆల=బాగుగా పొందునట్టి, అకీ=పూర్ణసుఖము కలవాడై, మాస్థా=(రాజ)లక్ష్మికి స్థానమైనవాడు (ఆయెను).

**తాత్పర్యము:-** అమాయకమైన, దేవతలకు సఖివంటి రాముని వాక్కు భరతునకు సుఖము కలిగించునదిగా వచ్చెను. అనగా సుఖము కలిగించున దాయెను. కాంతి కీర్తులు యోగము కల భరతుడు అధిక సుఖముగలవాడై అయోధ్యకు చేరెను. రాజ్యలక్ష్మీస్థానమాయెను. అనగా పరిపాలనము చేపట్టెను.

**వివరణము:-** రామునివాక్కు శంపా అను విశేషింపఁబడుటచేత పాదుక లను గొనిపోయి వానిని సింహాసనమునందుంచుమని నీవు సింహాసనముపై కూర్చొననక్కఱ లేదనియు నర్థమునిచ్చు వాక్కు, రాముని ఈ వాక్కు భరతుని సమాధాన పఱచినదని, రాముని విరహమున దుఃఖము కలవాడైనను పదునాలు గేండ్లు మాత్రమే తనకీ రాజ్యపాలన భారమాదేశింపఁబడినందున తరువాత రాముడు వచ్చి స్వయముగానే సింహాసనమధిష్ఠించగలడని భరతుడు చిత్తమున కొంత దుఃఖము తగ్గి భవిష్యత్కాలమున తనకిష్టమైన శ్రీరాముని సేవా భాగ్యము కలుగనున్నదని సమాధానపడి అయోధ్యకు తిరిగి పోయెనని ఈ శ్లోకము వ్యంజింపఁజేయును. *



# అరణ్యకాణ్డము

**అవతారిక:-** పై శ్లోకమున భరతుడయోధ్యకు వెనుదిరిగి పోవుట చెప్పఁ బడినది. ఈ శ్లోకమున సీతాలక్ష్మణసహితుడైన శ్రీరాముడు వనమున దక్షిణము వైపు పోవుచు విహరించుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పాయాదే తం రామేరాజానేతా దేవాలీనామాశా।**
**ధా నాధీనానేకాలోకీ మాస్థానా భాఖ్యా యోగీ శమ్॥ 25**

**పదవిభాగము:-** పాయాదేతం-రామేరాజానేతా-దేవాలీనామ్-ఆశా-ధానాధీనానేకాలోకీ-మాస్థానాభాఖ్యా యోగీ-శమ్.

**ప్రతిపదార్థము:-** ప=పాలకుడా!, ఏ=మన్మథుని వంటివాడా!, రామ= మనోహరుడా!, ఇరాజానేతా=భూజ(సీత)కు నాయకుడు(రాముడు), దేవాలీ (రీ)నామ్=రాక్షసులయొక్క, ఆశా=దిక్కు గలదో, తమ్=దానిని (దేశమును) గూర్చి, ఆయాత్=వచ్చెను (చేరెను), శమ్=ఆనంద స్వరూపుఁడైన, మాస్థానా భాఖ్యా యోగీ-మాస్థాన=లక్ష్మికి స్థాన భూతుడైన (శోభతోకూడిన), ఆభా= కాంతితో, ఆఖ్యా=కీర్తితో, యోగీ=సంబంధముగలవాడై, ధానాధీనానేకాలోకీ-ధా= రక్షణమును, నాధీ=యాచించు, ఈ=వాక్కులందు, ఇన=ప్రభువుల (మునుల), అనేక=అనేకులను, ఆలోకీ=చూచువాడై (చరించెను).

**తాత్పర్యము:-** ఓ రక్షకా, మన్మథుని వంటి అందమైనవాడా!, రాముడు దేవారులైన రాక్షసుల దిక్కైన దండకారణ్యమును చేరి శోభాకాంతికీర్తులు గలవాడై తమ రక్షణము నర్థించు మునుల ననేకులను చూచుచు బ్రహ్మానంద రూపుడైన రాముడు విహరించెను.

**వివరణము:-** రలయోరభేదః అను అభియుక్తోక్తి ననుసరించి దేవాలి శబ్దము రాక్షసుల బోధించును. ఈన శబ్దము ఈ ఇన అను విభాగమున వాక్కులకు ప్రభువులు అను నర్థమున శాపాయుధులైన అనగా శాపవాక్కులు యథార్థములగుట అను ప్రభుత్వము లేక ప్రభావము గల మునుల బోధించును. సీతాలక్ష్మణసహితుడైన శ్రీరాముని వనవిహారము నీ శ్లోకము వర్ణించును.

వాల్మీక్యత్ర్యగస్త్యాది మునుల ఆశ్రమ భూములలో నివసింపఁబోవుటను సూచించును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీసీతారామలక్ష్మణుల వనవిహారము చెప్పఁబడినది. ఈ శ్లోకమున విరాధవధమును రాముడొనరించిన పిమ్మట ఆవగ భూములలో జనసంచారాధిక్యము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యాదేతం రామేరాజానేతా దేవాలీనామాశాధా।**
**నాధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీ శమ్ పా॥ 26**

**పదవిభాగము:-** యాదా-ఏతం-రామేరాజానేతా-దేవ-అలీనా-అమాశా-అధా-న-అధీన-అనేకాలోకీ-మాస్థానాభాఖ్యాయోగీ-శం-పా.

**ప్రతిపదార్థము:-** రామేరాజానేతాదేవ-రామ=రాముని యొక్క, ఇరాజా= సీత యొక్క, అనేతా(న+న+ఇతా) గమనాభావాభావము అనగా గమనము, అలీనామాశాధా-అలీన=లీనముగాని, ఆమాశ=రాక్షసుని యొక్క, అధా=అస్థితి (మరణము), యాదా=సర్వజన గమన(సౌకర్య)మును ఇచ్చునది ఆయెను, ఏతమ్=ఈ, అధీనానేకాలోకీ-అధి+ఇన=సూర్యుని యందు, అనేక=అనేకమైన (మాటి మాటికి), ఆలోకః=దర్శనముగల, మాస్థా=బుద్ధికి స్థానమైన, ఆభాఖ్యా యోగీ-అ=బ్రహ్మవిష్ణుమహేశ్వరుల యొక్క, ఆభా=పూర్ణకాంతిగల, ఆఖ్యా= కీర్తుల, యోగీ=ఆసక్తిగల, ప=రక్షకుడా!, యోగీ=యోగి(జనసమూహము), శమ్= సుఖ(వంత)ము, న న=కాలేదనుట లేదు.

**తాత్పర్యము:-** సీతారామ లక్ష్మణుల ఆగమనము దండకారణ్యమున జరుగుచుండగా దాగని విరాధ రాక్షసుని మరణము రాముని చేత సంభవించగా జనుల రాకపోకలు ఎక్కువ ఆయెను. ముని సమూహము సుఖవంతమయ్యెను.

**వివరణము:-** అపక్వమైన మాంసాదికమును తినువాడు ఆమాశుడు. సందర్భము ననుసరించి ఈ రాక్షస సామాన్యవాచి శబ్దము రాక్షస విశేషమైన విరాధుని బోధించును. శ్రీరాముని రాకను గమనించి దాగిపోవలసినవాడై యుండగా దాగక, రాముని ఎదుటపడి ఆయనచే వధింపఁబడెనని వాని అలీనతయే వాని వధకు కారణమయ్యెను అనుటను వ్యంజించును. నా ధీన



.... కీ, నాభాఖ్యాయోగీ అను సమాసములందలి న న అనురెండు నిషేధాలను శమ్ పదముతో అన్వయించి యోగిజన సుఖము నేతి నేతీత్యాది సర్వనిషేధ పర్యవసానమున లభించు బ్రహ్మానందము అని గమనింపవలెను.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామకృత విరాధవధ సూచింపఁబడినది. ఈ శ్లోకమున అగస్త్యముని శ్రీరామునకు ధనువు నిచ్చుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ దేతం రామే రాజానేతాదేవాలీ నామాశాధానా।**
**ధీనానేకాలోకీ మాస్థానాభాఖ్యాయోగీశం పాయా॥ 27**

**పదవిభాగము:-** దేతమ్-రామే-రాజానేత-అదేవాలీ-ఇన-అమాశాధాన-అ-ధీన- అనేకాలోకీ-మాస్థానాభాఖ్యా-అయోగేశం-పాయ-అ.

**ప్రతిపదార్థము:-** పాయ=కాపాడు శుభవిధి కలవాడా!, అ=విష్ణూ!, ఇన= ప్రభూ!, అమాశాధాన-అమ=అవిచ్ఛిన్నములైన, ఆశా=ఆశలయొక్క, ఆధాన= బాగుగా పోషించువాడా, ధీన(ధీ+ఇన)=బుద్ధియందు సమర్థుడైనవాడా, రాజానేతా దేవాలీ-రాజా=(ఇతర)రాజులచేత, అనేత=పొందఁబడని(దుర్లభమైన), అదేవాలీ (రీ)=రాక్షసభావముగల, అనేకాలోకీ మాస్థానాభాఖ్యాయోగీశం- అనేకాలోకి=అనేక నేత్రములు గలవాని (ఇంద్రుని) యొక్క, మాస్థాన=లక్ష్మీస్థానము(స్వర్గము) నందు, ఆభా=కాంతి, ఆఖ్యా=కీర్తిగల, అయోగీశమ్=ధనుఃశ్రేష్ఠము, రామే= రాముని యందు, దేతమ్ (దా+ఇతమ్)=దానమున పొందఁబడినది.

**తాత్పర్యము:-** ఓ రక్షకుడా!, అపరిచ్ఛిన్నములైన ఆశల పోషించు వాడా, బుద్ధియందు సమర్థుడా!, ఇతర రాజులకు దుర్లభమైన రాక్షస సంహారకుడైన ఇంద్రుని స్వర్గమునందలి కాంతికీర్తులకు నెలవైన శివుని ధనువు రామునికి ఆగస్త్యునిచే దత్తమయ్యెను.

**వివరణము:-** అయః అనగా ఇనుము లేక ఉక్కు. అయోగి అనగా ఇనుము లేక ఉక్కుతో సిద్ధము చేయబడునట్టి ధనువు అట్టి ధనువులలో శ్రేష్ఠమైనది. కావున అగస్త్యుడు శ్రీరామునకిచ్చిన ధనువు అయోగీశము అని చెప్పఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామున కగస్త్యుడు ధనువు నిచ్చుట చెప్పబడినది. ఈ శ్లోకమున శ్రీరాముని కడకు శూర్పణఖ వచ్చుట చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ తం రామేరాజానేతా దేవాలీనామాశాధానాధీ।**
**నానేకాలోకీ మా స్థానాభాఖ్యా యోగీ శంపాయాదే॥ 28**

**పదవిభాగము:-** తమ్-రామేరా-అజానేతా-దేవాలీనా-ఆమాశా-ఆధా-అనాధీ-న-అనేకాలోకీ మాస్థానాభాఖ్యాయోగీ శంపా-అయాత్-ఏ.

**ప్రతిపదార్థము:-** ఏ=ఓ ఇంద్రతుల్యుడా, అజానేతా=(అజాన+ఇతా)జన సంబంధ మర్యాదతో కూడని(లేని),దేవాలీనామాశాధానాధీ-దేవాలి(ర)=దేవ రాక్షస సమూహము యొక్క, ఇనా=ప్రభ్వియైన, ఆధా=అధికపూజగల, అనాధీ=నాథ రహిత(విధవ)యైన, ఆమాశా=రాక్షసి(శూర్పణఖ), అనేకాలోకీ-నానేక (న+న+ ఏక)=ముఖ్యముకాని, ఆలోక=వెలుగుగల, ఈ=లక్ష్మియొక్క, మా= కాంతి వంటి కాంతి గల, స్థానాభాఖ్యా యోగీ-స్థాన=(చిరకాలము) ఉనికి (స్థితి) గల, ఆభాఖ్యా=కాంతికీర్తుల యొక్క, యోగీ=సంబంధముకల, శంపా= విద్యుత్తైన, రామేరా=రామ అను వాక్కు గలదై, తమ్=ఆతనిని (రాముని), ఆయాత్= చేరెను.

**తాత్పర్యము:-** జన సంబంధి మర్యాదలేని దేవతల సమూహమునకు లేక రాక్షసులకు ప్రభ్వియైన అధిక పూజ్యురాలైన విధవయైన శూర్పణఖ చిరకాలము ప్రకాశించు మెఱపుతీగవలె మనోహరమైన రూపము ధరించినదై రామ అని సంబోధించుచు రాముని చేరెను.

**వివరణము:-** రావణుని అధికారము ప్రబలమై, దేవతలు, రాక్షసులు వానికి లోబడి యుండిరి. రావణుని పరివారమునకు కూడ దేవతలు రాక్షసులు దాసులుగానే వ్యవహరించు చుండిరి. ఆ కారణముచేత శూర్పణఖ దేవాలీనా దేవాలికి దేవసమూహమునకు రలయోరభేదః అను అభియుక్తోక్తి ననుసరించి దేవతలకు, అరులైన రాక్షసులకును ప్రభ్వియై యుండెనని రెండర్థములలో విశేషింపఁబడినది. ఆ శూర్పణఖ తన కామరూప ధారణశక్తితో రాక్షస



రూపమును విడచి స్థిరముగానుండు మెఱపువలె ప్రకాశించిన దాయెను. చంచలకు నిశ్చలత్వము సంభవింపక పోయినను శూర్పణఖ నిశ్చల చంచల (స్థిరమైన మెఱపుగా)సంభావింపఁబడినందున ఈ శ్లోకమునందు ఉత్ప్రేక్షా విరోధాభాసాలంకార స్ఫూర్తి ఉన్నది.

**అవతారిక:-** పై శ్లోకమున శూర్పణఖాగమనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శ్రీరామలక్ష్మణ తిరస్కరణ కర్ణనాసాచ్ఛేద దుఃఖితయైన ఆ శూర్పణఖ రావణుని కడకేగుట చెప్పఁబడుచున్నది.

**శో॥ రామేరాజానేతా దేవాలీనామాశాధానాధీనా।**
**నేకాలోకీ మాస్థానాభాఖ్యా యోగీశంపాయా దేతమ్॥ 29**

**పదవిభాగము:-** రామేరాజానేతా-దేవాలీనా-ఆమాశాధానాధీనా-నేకా-లోకీ -మాస్థానాభాఖ్యా యోగీ-ఈశం-పా ఆయాత్.

**ప్రతిపదార్థము:-** రామేరాజానేతా (రామ+ఇరా+జ+అనేతా)-రామ= రాముని యొక్క, ఇరా=వాక్యము నుండి, జ=పుట్టిన, అనేతా=అతేజస్కతగల, దేవాలీనా-దేవ=దేవతలకు కూడా, అలీనా=దాగని (వెలుగు), ఆమాశాధానాధీనా- ఆమాశా=రాక్షసుల, అధాన=అపోషణమునకు, అధీనా= అధీనురాలు (ఆయెను), నేకా=ముక్కుచెవులుకోయబడుటచే, శోభారహితయైన, లోకీ=లోకములు (అధీనమున) గలవాడు, (త్రిలోకాధిపతి), మాస్థానభాఖ్యా యోగీ-మా=మితికి, ఆస్థాన=ఆస్థాన మైన, ఆభాఖ్యా=కాంతికీర్తులు, అః=అలంకారముగా గల, అగీ=పర్వతము (చిత్ర కూటము) (ఆశ్రయముగా) గలదై, ఏతమ్=వీనిని (రావణుని), ఈశంపా= మెఱపువంటి వాక్యము గలదై, ఆయాత్ =వచ్చెను.

**తాత్పర్యము:-** శ్రీరాముని వాక్యము వలన తనయందు నిస్తేజస్కత గలుగు చుండగా దేవతలకు గూడ దాగకుండ వెలుగుచు ఖరాది రాక్షసుల అపోషణము అధీనమున గలదై ముక్కుచెవులు కోయఁబడుటచే శోభా విహీనురాలై త్రిలోకాధిపతి యొక్క లక్ష్మికి స్థానమైన కీర్తికాంతులు భూషణముగా గల రావణునకు చెల్లెలి వరుసయైన, చిత్రకూట పర్వతము నివాసముగా గలదైన శూర్పణఖ గద్గదస్వరము గలదై రావణుని కడకు పోయెను.

**వివరణము:-** శ్రీరాముడు తానేకపత్నీవ్రతము గలవాడ నగుటచే నిన్ను భార్యగా స్వీకరింపఁజాలనని చెప్పుటతోడనే శూర్పణఖ నిస్తేజస్కురాలయ్యెను. లక్ష్మణుడు ఆమె ముక్కుచెవుల గోసివేయగా ఆమె శోభా విహీనురాలయ్యెను. ఆమె సుందరమైన కామరూపము వికృతమగుట చేతను ఆమె శోభాహీనురాలయ్యెను. ఈశంపా శబ్దము మెఱపు వంటి మాట కలది అను అర్థమునిచ్చును. మెఱపుతో పాటు ఉఱుము ఉండును. కావున ఆమె గద్గద స్వరము గలదయ్యెను అను అర్థము నిచ్చును.

**అవతారిక:-** పై శ్లోకమున శూర్పణఖ రావణుని కడకు పోవుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున రావణకృత సీతాపహరణమువలన కలగిన శ్రీరాముని దుఃఖము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మేరాజానేతా దేవాలీనామాశాధానాధీనానే।**
**కాలోకీ మా స్థానా భాఖ్యా యోగీశం పాయాదేతం రా॥ 30**

**పదవిభాగము:-** మేరాజానేతా-దేవాలీ-ఇన-ఆమాశాధా-నాధీనా-అనే-కాలః -అకీ- మాస్థానాభాఖ్యా-యోగీశమ్-ప-ఆయాత్-ఏతమ్-ర-అ.

**ప్రతిపదార్థము:-** ర=అగ్నీ, అ=విష్ణూ!, ఇన=ప్రభూ!, అనే!=మన్మథ వికారము లేనీవాడా!, ప=పాలకుడా!, దేవాలీ(రీ)=దేవతలను యుద్ధము కొఱకు తీసుకొను(నిపోవు)వారైన రాక్షసులు గలవాడు (రావణుడు), మేరాజానేతా=(మా+ఇరాజా నేతా)=భూపుత్రి(సీత)కి నాయకుడు(తీసుకొని పోవువాడు), (శ్రీరాముడు లేక లక్ష్మణుడు) లేనివాడై, నా=మనుష్యుడై(మనుష్యవేషధారియై), ఆశాధానాధీ= ఆశాధా+నాధీ=దిక్కును పొందించుటచే పీడ గలవాఁడై, కాలః=నల్లని, మాస్థానా భాఖ్యాః= శోభకు స్థానమైన కాంతికీర్తులు భూషణములుగా గలవాడు, అకీ= దుఃఖముగల (రాముడు), ఏతమ్=(ఎదురుగా)వచ్చిన, యోగీశమ్= లక్ష్మణుని, ఆయాత్=చేరెను.

**తాత్పర్యము:-** అగ్ని వంటి వాడా!, విష్ణువు వంటి వాడా!, ఇన=ప్రభూ, మన్మథ వికారము లేనివాడా! దేవతలను యుద్ధమునకు తీసుకొనిపోవు రాక్షసులు



గల అనగా రాక్షసనాయకుడైన రావణుడు రామలక్ష్మణులను మాయామారీచ మృగ వ్యాజమున దూరమునకు పంపించెను. సీత నపహరించెను. సీతను విడచి తనకెదురుగా వచ్చిన లక్ష్మణుని నల్లని దుఃఖముగల రాముడు చూచెను.

**వివరణము:-** యోగములనగా సూత్రములు. అవి కలవాడు యోగి పాణిని వ్యాకరణ శాస్త్రములు. వ్యాకరణశాస్త్రమునకు పతంజలి ప్రభువు. కావున యోగీశ శబ్దార్థము పతంజలిగా అవతరించిన శేషుని అవతారమే లక్ష్మణుడైనందున యోగీశ శబ్దము లక్ష్మణుని బోధించును. సీతను విడచి తన యాజ్ఞను పెడచెవిని బెట్టి వచ్చు లక్ష్మణుని చూచిన ఆ సమయమున నక్కలు మొదలైన వాని అమంగల ధ్వనుల వినుటచే గల్గిన దుఃఖము కలవాడు రాముడు అని అకీ శబ్దము బోధించును. కాల శబ్దము రాముని నల్లని వర్ణముతో పాటు రావణునకు రాబోవు మృత్యువు అనియు బోధించును.

**అవతారిక:-** పై శ్లోకమున రావణకృత సీతాపహరణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ రావణుని చేత హతపక్షుడైన జటాయువుకడకు శ్రీరాముడు వచ్చుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ రాజా నేతా దేవాలీనామాశాధానాధీనానేకా।**
**లోకీ మాస్థానాభాఖ్యాయోగీశం పాయాదేతం రామే॥ 31**

**పదవిభాగము:-** రాజా-నేతా-దేవాలీనామ్-ఆశా-ధానాధీ-ఇన-అనేక-అ-లోకీ -మాస్థానాభాఖ్యాయః-అగీశమ్-ప-ఆయాత్-ఏతమ్-రామే.

**ప్రతిపదార్థము:-** ప=పాలకుడా, అ=విష్ణుతుల్యుడా, ఇన=ప్రభూ, అనేక= బాహుల్యము గలవాడా, దేవాలీనామ్=దేవ సమూహములకు, నేతా=ప్రభువైన, రాజా=రాజు(రాముడు), ఆశాధానాధీ-ఆశా+ధా+నాధీ=ఆశ యొక్క ధారణముచే ఉపతాపము గలవాడై, లోకీ=చూచువాడై, మాస్థానాభాఖ్యాయః-మా=సీతారూప లక్ష్మియొక్క, స్థాన=స్థానమున (ఎదుట), ఆభాఖ్య=కాంతిఖ్యాతులు గల వానిని (జటాయువును), ఆయః=పొందినవాడు, రామే=అడవియందు, అగీశమ్= వానరులలో శ్రేష్ఠుడైన, ఏతమ్=వీనిని (ఆంజనేయుని, సుగ్రీవుని), ఆయాత్= చేరెను.

**తాత్పర్యము:-** దేవ సమూహ ప్రభువిష్ణ్వవతారమైన రాజైన రాముడు రావణు డపహరించి కొనిపోవుచున్న సీత యెదట రావణునితో యుద్ధముచేసి, కాంతికీర్తుల సంపాదించుకొన్న జటాయువును చేరుకొనెను. ఆ పిమ్మట అడవి యందు మొదట ఆంజనేయునితో సంభాషించి ఆ తరువాత సుగ్రీవుని చేరుకొనెను.

**వివరణము:-** అగ శబ్దము గమనరహితము అను వుత్పత్త్యర్థమున పర్వతములను వృక్షములను బోధించును. అగములు నివాసనముగా గల వానరములు అగి ( న్ ) శబ్దముచే బోధింపఁబడును. వానికీశుడైన సుగ్రీవుడు అగీశ శబ్దార్థమని గ్రహింపవలెను. ఆంజనేయుని కూడ పైనఁజెప్పిన విధముగా బోధించును. ఇకారాంతమైన అగి శబ్దము పర్వత వాచకము. గిరీశ శబ్దమువలె అగీశ శబ్దము కైలాసమును యౌగికముగా బోధించి ననురూఢిచే కైలాసగిరి కధిపతియైన శివుని బోధించును. శివావతార మగుటచే ఆంజనేయుని గూడ నీ శబ్దము బోధించును. అగములు అనగా వృక్షములు. వృక్షముల కలిగియున్నందున అగి శబ్దము పర్వతమును బోధించు ననవచ్చును. లేక అకారాంతమైన అగ శబ్దమువలె అగి శబ్దము కూడ గమనరహితార్థమున పర్వత వాచకముకావచ్చును. రమింపఁజేయును అను వ్యుత్పత్త్యర్థము ననుసరించి రామా శబ్దము స్త్రీని, రామ శబ్దము మృగ విశేషమును బోధించును. అచ్ ప్రత్యయాంతముగా భావింపఁబడిన ఆ 'రామ' శబ్దమే మృగ విశేషములుగలది అను అర్థమున నపుంసకలింగమున అరణ్యము అను అర్థమును బోధించును. ఆశాధానాధీ అను సమాసములోని ఆశా శబ్దము సీత లభించ గలదన్న రాముని ఆశను బోధించును. రామునకు ఆ ఆశను ధరించిన కారణమున సీతావియోగ జనితోపతాపము కూడా ఆతని బోధించుచునే యుండును. ప్రియురాలు లభించి ఆ ఉపతాపము తొలగునను ఆశయే శక్తిని కలిగించి ఆ దుఃఖమును సహించు వియోగ సమయమున వియోగి జనమును కాపాడుచుండును. *





## కిష్కిన్ధాకాణ్డము

**అవతారిక:-** పై శ్లోకమున జటాయువు ననుగ్రహించిన శ్రీరాముడు ఈ శ్లోకమున లక్ష్మణసమేత శ్రీరాముడాంజనేయసహిత సుగ్రీవునితో సఖ్యము చేయుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ జానేతాదేవాలీనామాశాధానాధీనానే కాలో।**
**కీమాస్థానాభాఖ్యాయోగీశం పాయాదేతం రామేరా॥ 32**

**పదవిభాగము:-** జానేతాదే-అ-వాలీనామ-ఆశాధానాధీనానే కాలః-కీమాస్థానాభాఖ్యాయః-అగీశమ్-ప-ఆయాత్-ఏతం-ఏం-రామేరా.

**ప్రతిపదార్థము:-** ప=పాలకుడా!, జానేతాదే=జనమర్యాదలో మొదట లెక్కింపఁదగినవాడా!, అ=విష్ణూ!, వాలీనామ=వాలియనెడివాడు (వానర ప్రభువు), ఆశాధానాధీనానే కాలః-ఆశ(స)=ధనువు యొక్క, అధాన=ధరణాభావము చేతనే, అధీన=లోబరచుకొనఁబడిన, అనేక=అనేకములైన, అరా=వేగ(బల)ము గల, కీమాస్థానాభాఖ్యాయః-కి=సూర్యాపత్యము (సుగ్రీవుని) యొక్క, ఈమాస్థాన=రాజ్యలక్ష్మి స్థానమైన, ఆభాఖ్యాయః=కాంతి కీర్తులనొందినవాడు(ఆమెను), ఏతమ్ =వీనిని (సుగ్రీవుని) గూర్చి, రామేరా=రాముని వాక్కు, ఆయాత్=వచ్చెను.

**తాత్పర్యము:-** జనమర్యాదను పాలించువారిలో అగ్రగణ్యాపాలకుడా!, విష్ణుతుల్యుడా! వాలియను వానర ప్రభువు ధనురాద్యాయుధములు సాయము లేకయే, తనగోళ్ళు, మొదలగు అవయవముల చేతనే అనేక బలశాలురను లోబరచుకొన్నవాడై సూర్యపుత్రుడైన సుగ్రీవుడను తన సోదరవానరుని రాజ్యలక్ష్మి నాక్రమించుకొని కాంతి కీర్తులు కలిగి యుండెను. అట్టి వాలిని చంపి నీకు రాజ్యము నొసగెదనను (శ్రీ రాముని ప్రతిజ్ఞా) వాక్యము సుగ్రీవుని చేరెను.

**వివరణము:-** ఇంద్ర పుత్రుడు వాలి. సూర్య పుత్రుడు సుగ్రీవుడు. ఒక రాక్షసునితో యుద్ధము చేయుటకు గుహలోకి వెడలిన వాలి ఎంతకాలమునకు రాలేదని, ఆతడు చచ్చినాడేమో అనుశంకతో వానిని చంపిన రాక్షసుడు వచ్చి

తనను నాశమొనరించునను భయమున మంత్రులు గుహను మూసియు అన్నకై ఎదురు చూచు సుగ్రీవుని వానర రాజ్య పట్టాభిషిక్తు నొనరించిరి. ఆ తరువాత కొంతకాలమునకు రాక్షసుని చంపి వచ్చిన వాలి, పట్టాభిషిక్తుడైన సుగ్రీవుని పై కోపముఁబూని వానిని వెడలగొట్టి ఆతని రాజ్యము నపహరించెను. సుగ్రీవుడు రాముని మిత్రునిగా నొనరించు కొనెను. శ్రీ రాముడు వాలిని చంపెదనని ప్రతిజ్ఞచేసెను. అని 'రామేరా' అను శబ్దము బోధించును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామసుగ్రీవులు పరస్పర సహకార ప్రతిజ్ఞలు చెప్పఁబడినది. ఈ శ్లోకమున శ్రీరామ ప్రతిజ్ఞ సుగ్రీవ ప్రతిజ్ఞ నెరవేరునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ జారామేరాతం దేయాపాశం గీ యోఖ్యాభానాస్థా మా।**
**కీ లోకానేనాధీనాధాశామానాలీ వాదేతానే॥ 33**

**పదవిభాగము:-** జారామేరాతమ్-దేయాపాశం-గీ-యః అఖ్యాభా-నా-ఆస్థా-మా-కీ-లోకానేనాః-ధీనాధా-ఆశా-అమానా-అలీ-వాదేతా-అనే.

**ప్రతిపదార్థము:-** అనే=మన్మథ వికార రహితా!, జారామేరాతమ్(జార+ఆమా+ఇరా+అతమ్)జారా=జారుని (రావణుని) యొక్క, ఆమా=విశేషకాంతిగల, ఇరా=భూమియందు, అతమ్=సంతతగమనము గలది (సర్వవస్తుజాతము), దేయాపాశం-దేయ+ఆప+ఆశమ్=ఈయదగిన ఉదక సమూహముగల, దిక్కు గల, యః=ఏ, నా=పురుషుడు, అఖ్యాభ=ఖ్యాతిరహిత కాంతి గల, గీ=జ్ఞానము గలవాడు, ఆస్థా=యత్నము, మా=లేనట్టిదే, ధీనాధ=బుద్ధికి ప్రభుడైన వాడా!, లోకానేనాః=లోకములందు పాపరహితుడై(న), కీ=సుఖసహితుడై ఉండును, ఆశా=కోరిక, అమానా=కొలతలేనిదై, వాదేతా=వాదములందు ప్రసిద్ధమైనది.

**తాత్పర్యము:-** మన్మథ వికార రహితా! జారుడైన రావణుని శోభాయుక్తమైన భూమి మొదలగు వస్తుజాల మంతయు ఈయఁదగిన ఉదక సమూహము గల దక్షిణ దిక్కునందు స్థితిగలదై యుండెను. ఏ పురుషుడు కీర్తిరహిత కాంతిగలవాడై అంతట ఆతని గూర్చిన జ్ఞానము కలవాడై అనగా సర్వత్ర ప్రసిద్ధుడై ఉండెనో ఆతనియత్నము అసత్ప్రాయము. ఓ బుద్ధికి నాథుడా!



లోకములందు పాపరహిత పురుషుడు సుఖవంతుడై యుండును. అను ఆశ అంతులేనిదై జనుల మాటలలో ప్రసిద్ధమగును.

**వివరణము:-** రావణుడు జారుడగుటచే ఆతని శోభ సత్కీర్తి రహితమయ్యెనని అఖ్యాభా అను శబ్దము బోధించును. ఆతని భూమి అందలి సంపద అంతయు చుట్టు ఉదక సమూహము అనగా సముద్ర ముండుటచే వాని ఆ దక్షిణ దిక్కు దురాసదమై యుండెనని దేయాపాశమ్ అను శబ్దము బోధించును. జ్ఞానవంతుడుగా, సుఖవంతుడుగా ప్రసిద్ధుడైనను పాపి సుఖవంతుడు కాఁజాలడను అర్థమును లోకానేనాః కీ అను అర్థాంతర న్యాసచ్ఛాయ గల పదములు బోధించును.

**అవతారిక:-** పై శ్లోకమున రావణుని వస్తుసంబంధ సంపత్తి చెప్పబడినది. ఈ శ్లోకమున శ్రీరాముని కా సంపత్తి చెప్పబడుచున్నది.

**శ్లో॥ రామేరాతం దేయాపాశంగీ యోఖ్యాభానాస్థా మా కీ**
**లోకానేనాధీనాధాశామానాలీ వాదేతానేజా॥ 34**

**పదవిభాగము:-** ర-అ-మేరా-తమ్-దేయా-ఆప-అశ(స)ంగీ-యః-అఖ్యాభాః-నాస్థా-మా-కీల(ర)ః-క-అనేక-అధీనాధ-ఆశా-మానాలీవాదా-ఇతా-అనేజా.

**ప్రతిపదార్థము:-** క=సూర్యతుల్యతేజము కలవాడా!, అ=విష్ణూ!, ర=అగ్నితుల్యా! యః=ఎవడు, అశ(స)ంగీ=సంగములేని, అఖ్యాభా-అ=విష్ణువు యొక్క, ఖ్యా=ప్రసిద్ధి, భా=కాంతి గలవాడో, నాస్థా-న+ఆస్థా=ప్రయత్నభావము, మా=లేదో, కీల(ర)ః=ఆంజనేయునందు, ఇలా(రా)ః=వాక్కుగలవాడో, తమ్= వానిని, దేయా=ఈయదగిన, మేరా-మా=లక్ష్మియొక్క, ఇరా=వాక్కు, ఆప=చేరెను అనేన= దీనిచేత, అనేజా=కదలికలేనిదో (స్థిరమైనదో), అధీనాధాశా-అధి=బుద్ధి లేని వారి యొక్క, లేక అధీన=శరణాగతుని(సుగ్రీవుని)యొక్క, ఆధా=సుపోషణముగల, ఆశ=ఆశ, మానాలీవాదా-మాన=చిత్తోన్నతియొక్క, ఆలీ=ఆళియను, వాద=వచనము, ఇతా=వచ్చినది.

**తాత్పర్యము:-** ఎవడు సంగములేనివాడో, విష్ణుతుల్య ఖ్యాతి కాంతులు గలవాడో నిరంతర ప్రయత్నశీలుడో మంత్రియైన వాయుపుత్రుని వాక్కు

గలవాడో, ఆ రామునిచే ఈయదగిన రాజ్యలక్ష్మీ సంబంధి ప్రతిజ్ఞ సుగ్రీవుని ఆశను బాగుగా పోషించునదై ఆతని చిత్త వికాసమునకు హేతువయ్యెను.

**వివరణము:-** మా అనగా లక్ష్మి. అది యిచట రాజ్యలక్ష్మీ బోధకము. ఇరా అనగా వాక్కు, మేరా అనగా శ్రీరాముడు సుగ్రీవునికి రాజ్యలక్ష్మి నిచ్చెదనన్న వాక్కు అను అర్థమునొసగును. మానమనగా చిత్తసమున్నతి. దానికి ఆలి అనగా సఖిగా వాదా అనగా ప్రసిద్ధిగలది. శ్రీరాముని రాజ్యలక్ష్మీ ప్రధాన వాక్కు సుగ్రీవుని చిత్త సమున్నతికి సఖిగా ప్రసిద్ధమైనదనగా ఆ వాక్కు చేత సుగ్రీవుని మానము పెరిగినదని భావము.

శ్రీరాముడు సుగ్రీవునకు వాలిని చంపి కిష్కింధా రాజ్యము నకు పట్టాభిషిక్తుని చేయుదునని ప్రతిజ్ఞ చేయుటవలన సుగ్రీవుని రాజ్యాశకు పుష్టి కలిగినది. అట్లే సీతను వెదకించి అప్పగించుటలో రావణుని వధించుటలో సాయము నొనరించెదనని చేసిన సుగ్రీవుని ప్రతిజ్ఞా వాక్కు రామునికి కూడ సంతోషమును కలిగించినది.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామ సంతోషములు నెరవేరుట చెప్పఁబడినది. ఈ శ్లోకముని ప్రతిజ్ఞావాక్కు దిగంత వ్యాప్తమగుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మేరాతం దేయాపాశంగీ యోఖ్యాభానాస్థామా కీ లో (లః)**
**కానేనా ధీనాధాశామానాలీవాదేతానేజారా॥ 35**

**పదవిభాగము:-** మేరా-తమ్-దేయా-ఆప-అసంగీ-యః-అఖ్యాభానాస్థామా-అకీలః-క-అనేనాః-ధీనాధా-ఆశా-మానాలీవాదేతా-అనేజార-అ.

**ప్రతిపదార్థము:-** అనేజార+అ=కదలని అంచులుగల చక్రము గల విష్ణు తుల్యుడా!, క=సూర్యతుల్యుడా, ధీనాథ=బుద్ధిప్రభూ!, యః=ఎవడు, అసంగీ =విష్ణుసంగము కలవాడో, అఖ్యాభాః=విష్ణుఖ్యాతి కాంతులతో సమానమైన ఖ్యాతి కాంతులు గలవాడో, అనేనాః=పాపరహితుడో, అకీల(ర)ః=సంపూర్ణ సుఖకర హక్కు గలవాడో (యస్య=ఎవనికి), నాస్థా=ప్రయత్నాభావము, మా=లేదో, తమ్ =వానిని (సుగ్రీవుని), ఆశా=ఆశా, మానాలీవాదేతా=లక్ష్మీతుల్య స్త్రీ సల్లాపమును పొందిన, మేరా=దిక్కులలోని రాజ్యలక్ష్మినిచ్చెదనన్న వాక్కు, ఆప=చేరెను.



**తాత్పర్యము:-** కదలని అంచులుగల చక్రముగల విష్ణుతుల్యుడా! సూర్య తుల్యుడా!, బుద్ధి ప్రభుడా!, ఎవడు విష్ణు సంగము కలవాడో, పాపరహితుడో, సంపూర్ణ సుఖకరవాక్కు గలవాడో, ఎవనికి ప్రయత్నాభావము లేదో ఆ సుగ్రీవునికి దిక్కులలోని శ్రీరాముని రాజ్యలక్ష్మి నిచ్చెదనన్న వాక్కు చేరెను.

**వివరణము:-** విష్ణు సంగము అనగా విష్ణ్వవతారమైన శ్రీరాముని సంగము. అది సుగ్రీవునకు విష్ణు ఖ్యాతి కాంతితుల్య ఖ్యాతి కాంతులను కలిగించినది. అని అసంగీ అఖ్యాభాః అను విశేషణములు వ్యంజించును. ఎటువంటి కొండలను కాని, కొండలవంటి రాక్షసుల ఱొమ్ములను తాకినప్పుడును విష్ణు చక్రము యొక్క అంచు కూడ కదల లేదు అనగా విఱుగలేదు అని వేఱుగా చెప్పనక్కఱలేదని (అనేజార+అ) అనేజారా అను సంబోధనము వ్యంజించును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామ ప్రతిజ్ఞ దిగంతవ్యాప్తమగుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున సుగ్రీవుని వాలిపై యుద్ధ యాత్ర చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ రాతం దేయాపాశం గీయోఖ్యాభానాస్థామా కీ లోకా।**
**నేనా ధీనాధా శా మానాలీవాదేతానేజారామే॥ 36**

**పదవిభాగము:-** రాతమ్-దేయా-అపాశమ్-గీయ-ఉఖ్యాభానాస్థామా-కీలా-ఉక-అ-న-ఇనా-ధీనా-అధా-శామా అనాలీవాదా-ఇతా-అనేజా-ఆరామే.

**ప్రతిపదార్థము:-** ఉ=ఓ, గీయ(గీ+ఈయ)గీ=ప్రసిద్ధమైన, ఈ=మహాలక్ష్మిని, య=పొందువాఁడా!, ఉక=ఓ శంభూ!, అ=విష్ణుతుల్యా!, దేయాపాశమ్-దేయ=ఈయఁదగిన, అపాశమ్=పాశము (ప్రతిబంధము) లేమి, రాతమ్=ఈయ (ప్రకటింప)బడినది, ఖ్యాభానాస్థామా-ఖ్యా=ప్రతిష్ఠా, భానా=ప్రకాశముల ఆస్థా=ప్రయత్నము యొక్క, మా=సంపత్తి, కీలా-కి=సుగ్రీవుని యొక్క, ఇలా (రా)=స్థానము గలది ఆయెను, అనేజా=చలించని, ఆనాలీవాదా=ఆనాలీ(రీ) వాద=అంతట స్త్రీలవాదము గల, ఇనాధీనాధాశామా-ఇన=ప్రభువు (వాలి), అధీన=అధీనమైన, అధా=అపుష్టమైన, ఆశా=దిక్కు, ఆరామే=ఉద్యానమున, న ఇతా=మా=రానిదికాలేదు (రానేవచ్చినది).

**తాత్పర్యము:-** ప్రసిద్ధమైన లక్ష్మిని పొందినవాఁడా, ఉక=ఓ శంభూ, అ=ఓ విష్ణూ!, దుందుభి కళేబరమును విసరి వైచుట చేత సప్తసాలభంజనము చేతను ప్రతిబంధాభావము రామునిచేత ప్రకటింపఁబడినది. అనగా శ్రీరాముడు ప్రతిబంధములను తొలగించెను. ఆ పిమ్మట వాలి వధానంతరము రాజ్యమును పొంది ప్రతిష్ఠా ప్రకాశములను పొందెదనని భావించిన సుగ్రీవుడు ప్రయత్నము నారంభించెను. అంతట యుద్ధమునకు పోవలదు అని తారాది నారీజనముల వాదములు వాలి యందు పోషింపఁబడని ఆశలు కలవయెను. అనగా వారి మాటల నావాలి లెక్క చేయలేదు. అంతట కిష్కింధా ప్రాంతోద్యానమున సుగ్రీవుడు యుద్ధార్థము వచ్చి విడిది చేసెను.

**వివరణము:-** ఒకప్పుడు వాలి దుందుభిని చంపి వాని శరీరమును పచ్చిగా ఉన్నప్పుడే దూరము విసరివైచెను. అది ఎండిపోయి ఉండగా శ్రీరాముడు దానిని కాలితో దూరముగా చిమ్మివైచెను. బరువు తగ్గిన శరీరమును చిమ్మివైచిన రాముని బలమున సుగ్రీవునకు రాముడు వాలిని చంపునను పూర్తివిశ్వాసము కలుగనందున శ్రీరాముడు సప్తతాలముల నొకే బాణమున ఛేదించెను. అప్పుడు సుగ్రీవునికి విశ్వాసము కలిగెను. విశ్వాసము కలుగటయే ప్రతిబంధము తొలగుటగా శ్లోకమున చెప్పఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున సుగ్రీవుడు వాలితో యుద్ధము చేయుటకై వచ్చి కిష్కింధా ప్రాంతోద్యానమున నివసించుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున వాలి వధ తరువాత రాముని నిందించుట శ్రీరాముని సమాధానము చెప్పఁబడినది.

**శ్లో॥ తం దేయాపాశం గీ యో ఖ్యాభానాస్థామాకీ లోకానే।**
**నాధీనాధాశామానాలీవా దేతానే జారామేరా॥ 37**

**పదవిభాగము:-** తమ్-దేయా-ఆప-అశమ్-గీ-యః-అఖ్యాభా అనాస్థా-మాకీ-లోకానే-నాధీ-ఇనాధాశా-అమా-నాలీవాదేతారా-అనేజా-రామేరా.

**ప్రతిపదార్థము:-** ఉ=ఓ, అ=విష్ణూ!, దేయ=(దా+ఈయ)=దానలక్ష్మి ప్రాప్తమైన వాఁడా, లోకానే-లోక=లోకములందు, అనే=మన్మథవికారము



లేనివాడా!, యః=ఎవడు, ఖ్యాభానాస్థామాకీ-ఖ్యా=పేరుతో, ఆభ=సమానమైన దానియందు, అనాస్థా=అనాదరముగల, మా అకీ=దుఃఖము లేని, గీ=గానము (కీర్తి) గలవాడో, తమ్=వానిని (వాలిని), అశమ్=అసుఖము, ఆప=పొందెను, నాధీ=నాధుడు గలది,ఇనాధాశా-ఇన=సుగ్రీవుని, ఆధా=పూర్ణ పోషణము నందలి, ఆశా=ఆశ, అమా=శోభయొక్క అభావము, నాలీ(రీ)వాదేతా, నారీ=స్త్రీ (తార) యొక్క, వాద=వచనమున, ఇతా=పొందఁబడినది (అయ్యెను), రామేరా-రామ= రాముని యొక్క, ఇరా=వాక్కు, అనేజా=కంపరహితము (గా ఉండెను.)

**తాత్పర్యము:-** దానలక్ష్మిని పొందినవాడా! విష్ణుతుల్యా! లోకమున మన్మథ వికార రహితుడా! ఎవడు కీర్తిమంతుడో, పేరునకు తగినట్లున్న తార మాట యందాదరమును వీడెనో అట్టి వాలిని అసుఖము పొందెను. సుగ్రీవుని పోషణము నందే ఆశగల తార వాక్కున అశోభ కలిగెను. అనగా రాముని తార నిందించెను. రాముని వాక్కు అకంపితము గానే ఉండెను. అనగా తన చర్యను యుక్తియుక్తముగా రాముడు సమర్థించుకొనెను.

**వివరణము:-** ఆత్మావై పుత్రనామాసి అను శ్రుతి ననుసరించి సుగ్రీవుని చెప్పు శ్లోకమందలి ప్రభువాచకమైన ఇన శబ్దము అంగదుని కూడ చెప్పును. అందుచే అంగదుని యువరాజ్యప్రాప్తి కూడ సూచించఁబడును. మొదట రాముని నిందించినను తార రాముని యుక్తియుక్త వాక్యమును విని దుఃఖమును వీడినదనియు అనేజా శబ్దము వ్యంజించును.

**అవతారిక:-** పై శ్లోకమున వాలి వధ చెప్పఁబడినది. ఈ శ్లోకమున సుగ్రీవుని వానర రాజ్యప్రాప్తి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ దేయాపాశం గీయో ఖ్యాభా నాస్థామాకీ లోకానేనా।**
**ధీనాధాశామానాలీ వాదేతానేజా రామేరా తమ్॥ 38**

**పదవిభాగము:-** దేయ-అపాశమ్-గీ-యా-ఉ-ఖ్యాభా-అ-అనాస్థా-మా కీలోకా-అనేన-అ-ధీనాధాశామానాలీవాదేతా-అనేజా-రామేరా-తమ్.

**ప్రతిపదార్థము:-** దేయ=దానలక్ష్మిని పొందినవాడా!, ఉఖ్యాభ=ఖ్యాతి మంతుడా!, అ=విష్ణుతుల్యా!, క=సూర్యుడా! (సూర్యునివంటి ప్రతాపము

గలవాడా!), అనేన=దీని (వాలివధ) చేత, యా=ఏ, గీ+ఈ=గీ=గానము (కీర్తి) తోడి లక్ష్మి (పొందఁబడినదో), ధీనాధాశామానాలీ వాదేతా-ధీ=బుద్ధికి, నాధ =ప్రభువువైన వాలి యొక్క, ఆశా=ఆశా స్థానములందు, మాన=మాన (గౌరవ)ము గలవారి యొక్క, ఆలీ=వరుసలు యొక్క, వాద=సల్లాపమునందు, ఇతా=ప్రసిద్ధ మైన, అనేజా=అకంపితమైన, కీ+ఇలా=కీలా=సుఖముగల భూమి, మా=రాజ్యలక్ష్మి, అనాస్థా=ఆస్థలేనిదై, అపాశమ్=అప్రతిబంధముగా, రామేరా తమ్=రాముని వాక్కుచే పొందఁబడినది (రామునిచే చెప్పఁబడినట్లు), ఆప=పొందెను.

**తాత్పర్యము:-** ధనలక్ష్మిని పొందినవాడా!, కీర్తికాంతులు గలవాడా!, విష్ణుతుల్యుడా! ప్రతాపమున సూర్యుని వంటి వాడా!, అనేన=దీని (వాలివధ) చేత, గీయ=కీర్తితోకూడిన కాంతి లభించినది. ఈ విషయము బుద్ధిమంతుల ఆశాస్థానముల యందు మానవంతుల వరుస సల్లాపములలో ప్రసిద్ధమైనది. అకమ్పితమైన, సుఖవంతమైన భూమి రాజ్యలక్ష్మి ఆదరము లేనిదై ప్రతిబంధ రహితముగా రాజవు కమ్మను రామునివాక్కు సుగ్రీవుని పొందినది.

**వివరణము:-** వాలి వధ చేత రాముని కీర్తి బుద్ధిమంతుల యొక్క మానవంతుల యొక్క గోష్ఠులలో వ్యాపించినది. వాలి యందాదరము వీడి రాజ్యలక్ష్మి ప్రతిబంధహీనురాలై నిన్ను చేరినది. కావున సుగ్రీవా! నీవు రాజ్య పట్టాభిషిక్తుడవు కమ్మని రాముడు సుగ్రీవునికి చెప్పుట రాముని అధికార ధనాశా రాహిత్యమును వ్యంజించుచున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున సుగ్రీవుని రాజ్యప్రాప్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున సీతాన్వేషణకై బయలుదేరిన వానరులు వర్ణింపఁబడుచున్నారు.

**శ్లో॥ యాపాశంగీ యోఖ్యా భానాస్థా మా కీలోకానేనాధీ।**
**నాధాశా మానాలీ వాదే తానేజా రామే రాతం దే॥ 39**

**పదవిభాగము:-** యా-అపాశంగీయోఖ్యాః-భానాస్థాః-మా-కీలోకా-అనే నాధీ-నాధా-ఆశా-మానాలీవాదా-ఇతా-అనేజా-రామే-రాతమ్-దే.

**ప్రతిపదార్థము:-** కీలోకాః=కి+ఈ+లోకాః-కి=సుగ్రీవుని, ఈ=(రాజ్య)



లక్ష్మి (గల భూమి) యందలి, లోకాః=(సుగ్రీవుని ఆజ్ఞను పాటించు) జనులు (కపులు), యా పాశంగీ యోఖ్యాః-యా=గమనమందు, అపాశం(సం)గి= అపగతమైన (ఇతర) ఆసంగముగల (ఇతర వ్యాసంగము లేని), ఈ=లక్ష్మిని, య=పొందు ఉఖ్యాః-ఉ=శివుని, ఖ్యాః=ఖ్యాతివంటి ఖ్యాతిగల, భానాస్థా= ప్రకాశించుట యందు ఆస్థగలవారు, మా=కారు, అనేనాధీ=మన్మథ వికార రహితుడైన ప్రభువు (రాముడు) గల, నాధాశా-నాధా=ప్రభ్వి (సీత) యందు, ఆశా=పోషణాశ గలవారు, గలది (వారిచేత), మానాలీవాదా=మా=లక్ష్మియైన, నారీ=స్త్రీ (సీత) యొక్క, వాదా=ప్రసంగముగల, ఆశా=(దక్షిణ) దిక్కు, అనేజా= కంపనరహితమైనది, దే=ఇచ్చు, రామే=రామునియందు, రాతమ్=ఈయఁ బడినది.

**తాత్పర్యము:-** సుగ్రీవుని రాజ్యలక్ష్మిగల దేశమైన కిష్కింధ యందుగల కపులు అన్ని దిక్కులకు వ్యాసంగ రహితులై గమన (ప్రయాణ) మొనరించిరి. వారు శివుని కీర్తివంటి కీర్తి గలవారు, రాజ్యలక్ష్మి యందాసక్తి లేనివారు ప్రతిష్ఠ యందే తత్పరులు రాముడు సీతాదర్శన లాలసుడని యెరిగినవారు లక్ష్మివంటి సీత దక్షిణ దిక్కునందుండునని భావించి, సుగ్రీవునకు రాజ్యప్రదానము చేసిన రామునందే దత్త మొనరించిన చిత్తము గలవారై యుండిరి.

**వివరణము:-** దక్షిణ దిక్కు కంపన రహితమని చెప్పుట చేత నరవానర సంచార మెక్కువగుటచే, రాక్షసభయముచే వడకు మునులు భయరహితు లైనారను అర్థమిట వ్యంగ్యము. *

## సుందరకాండము

**అవతారిక:-** పై శ్లోకమున సీతాన్వేషణారంభము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ సీతాన్వేషణ యత్నమున ఆంజనేయుడు దక్షిణ దిక్కునకు వచ్చుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పాశంగీ యోఖ్యాభానాస్థామా కీలోకానేనా ధీనా।**
**ధాశామానాలీ వాదే తానేజా రామేరా తం దేయా॥ 40**

**పదవిభాగము:-** పాశంగీ-యా-ఉ-ఖ్యాభానాస్థా మా-కీ-లోకానేనాః-ధీనా-అ-ధ-ఆశామ్-ఆ-అనాలి-(రీ)-ఈ-వాదేతానేజ-ఆర-ఆమేరా-ఆతమ్-దేయా.

**ప్రతిపదార్థము:-** ఉధీన=ఓ బుద్ధికి ప్రభువైనవాడా!, అ=విష్ణుతుల్యుడా!, అనాలీవాదేతానేజ-అనాలి(రి)=శత్రువులుకాని వారి (మిత్రుల) యొక్క, ఈ వాద=ఈ=స్తుతి వాక్కు యొక్క ప్రసంగము చేత, ఇత=పొందఁబడిన వాడా! అనేజ=కంపరహితుడా! ధ=కొండవలె భూమిని ధరించువాడా!, యా=ఎవతె, పాశంగీ-ప=పాలకునితో, ఆశ(స)ంగి=సంబంధించిన, ఈ=వాక్కుగలదో, ఖ్యాభానాస్థా-ఖ్యా=కీర్తి యొక్క, భా=కాంతి యొక్క, అనాస్థా=యత్నములు గల, యా=ఏ, మా=(సీతారూప) లక్ష్మి (ఉన్నదో), (తస్యాః=ఆమె యొక్క), ఆమేరాతమ్, ఆమ=అంతట ప్రకాశము గల, (మనోహరమైన), ఇరా(లా)= భూమియందు, ఆతమ్=తిరుగు, ఆశామ్=దక్షిణ దిక్కును, లోకానేనాః =లోకమున పాపరహితుడై, కిః=ఆంజనేయుడు, ఆర= పొందెను.

**తాత్పర్యము:-** ఓ బుద్ధికి ప్రభువైనవాడా!, విష్ణుతుల్యుడా!, అంతట మిత్రుల స్తుతి ప్రసంగములచే పొగడబడినవాడా!, కంపరహితుడా!, పర్వతము వలె భూమిని ధరించువాఁడా!, భర్తకు సంబంధించిన, స్తుతించుటకై యత్నించు లక్ష్మ్యవతారమైన సీతయొక్క మనోహరమైన భూమిని పొందిన దక్షిణ దిక్కును లోకమున పాపరహితుడైన ఆంజనేయుడు పొందెను.

**వివరణము:-** ఆమేరాత్=ఆమ శబ్దము తకారాంత స్త్రీ లింగ విశేషణము. ఆశల (దిక్కుల) విశేషించుచున్నది. లక్ష్మీస్వరూపిణియైన సీత నివసించుటచే



లంక యందలి భూమి ఆమమైనది. అంతట ప్రకాశము కలదైనది. లేక సముద్ర మధ్యన నుండుటచే తేమ గలిగినఁదగుటచే పచ్చగడ్డి లేక ఇసుకతో నిండి ఆమమైనది. ఖ్యాభానాస్థా శబ్దము సీత యొక్క కీర్తికాంతులేకాక శ్రీరాముని కాంతికీర్తుల కూడ సూచించును. వానిని పొందుటకు సీతచేయు యత్నమును అనగా రామునిపొందు యత్నమును కూడ సూచించును. సీత యత్నము రామునిధ్యానము తప్ప మరేదియు లేదు. కనీసము మిత్రురాండ్రతో కలసి శ్రీరాముని కీర్తికాంతుల ముచ్చటించుకొను నవకాశమును ఆమెకు కలుగలేదు. అనుట వ్యంగ్యము.

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయుని దక్షిణ దిగన్వేషణారంభము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆతడు సముద్ర తీర భూమిని చేరుట చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ శంగీ యో ఖ్యాభానాస్థా మా కీలోకానేనాధీనాధా।**
**శామానాలీ వాదేతానేజా రామేరాతం దేయాపా॥ 41**

**పదవిభాగము:-** శ(సం)ంగీ-యః-అఖ్యాభానాస్థామా-ఆకీలోకా-అనేన- అనాధీనాధ-అ-శా(సా)-అమానాలీ వాదా-ఇతా-అనే-జా-రామేరాతం-దేయాపా.

**ప్రతి పదార్థము:-** అనాధీనాధ=విష్ణుబుద్ధుల ప్రభుడే, అనే=కామవికార రహితుడా, యః=ఎవడు, శ(సం)గీ=(అ=విష్ణుతుల్యా) ఆసక్తి గలవాడో, అఖ్యాభానాస్థామా-అ=విష్ణువు యొక్క, ఖ్యా=కీర్తి యొక్క, భా=కాంతి లేక ప్రతాపము యొక్క, ఆస్థా=ప్రయత్నముగల, మా=సంపత్తిగలవాడో, అకీలోకా-అకీ=దుఃఖముగల, ఈ=లక్ష్మి (సీత) యొక్క, లోకా=దర్శనము గలవాడో (వాదో), అనేన=వాని (హనుమంతుని) చేత, శా(సా)=ఆమె (సీత), అమానాలీ= పరిమితి లేని సొంత సైకత భూములుగల, వాదా=గమనమునిచ్చు, రామేరాతమ్ -రామ=అందమైన, ఇరా(లా)=(తీర) భూమి యందు, ఆతమ్=సంచారము గలగునట్లుగా, దేయాపా-దేయా=ఈయఁదగిన, ఆపా=ఉదకముగల, జా= చెలియలికట్ట, ఇతా=పొందఁబడినది.

**తాత్పర్యము:-** ఎవడు సీతను పొందగోరిన వాడో? ఎవతె ఆ విష్ణుని (రాముని) ఖ్యాతిని పెంపొందించు యత్నసంపత్తిగలదో, దుఃఖముగలదై రాముని చూడగోరు, ఆ సీతను చూడగోరు, ఆ ఆంజనేయునిచేత అంతులేని ఇసుక తిన్నెలుగల, ఈయగల జలముగల, సముద్రతీర భూ ప్రదేశము పొందఁబడినది.

**వివరణము:-** అనాధీనాథ శబ్దము విష్ణుసంబోధనము. ధీ అనగా బుద్ధి. అ అనగా విష్ణువు. నాథ అనగా ప్రభువు. విష్ణువునందు బుద్ధిగలవారి ప్రభువు అధీనాధుడు. గత్యర్థక వాధాతుజమైన వా శబ్దము గమనము అను అర్థమును బోధించును. రామసంచార యోగ్యము అగునట్లు ముందుగా ఆంజనేయుడా, రామ అనగా మనోహరమైన ఇరా అనగా భూమి యందు సంచరించెనను వ్యంగ్యార్థమును రామే రాతమ్ అను క్రియావిశేషణము బోధించును.

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయుడు దక్షిణ దిక్కున సీతకై వెదకుచూ దక్షిణ సముద్రతీరమును చేరుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున శ్రీ సీతాదేవి కుశలముగా లంకయందున్నదని సంపాతివలన ఆంజనేయుడు తెలిసికొనుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ గీయోఖ్యాభానాస్థా మాకీ లోకానేనా ధీనాధాశా।**
**మా నాలీవాదేతానేజారామేరాతం దేయాపాశమ్॥ 42**

**పదవిభాగము:-** గీయ-ఉఖ్య-అభానాస్థా-మాకీ-లోకానేనాః ధీనాధాశా మా నాలీ వాదేతానేజారామేరాతమ్ దే-యాపాశమ్.

**ప్రతిపదార్థము:-** గీయ=గీ+ఈయ=గానవల్లక్ష్మీచ్ఛావంతుడా!, ఉఖ్య= శివునికీర్తి వంటి కీర్తి గలవాడా!, లోకానేనాః=లోకమందు పాపరహితుడైన, ధీనాధాశా=బుద్ధికినాథులైన వారిని పొందు, అభానాస్థా=ప్రకాశాస్థ లేని (అర్థము) ప్రకాశించని, యా=ఏ, మాకీ+ఈ=లక్ష్మియైన సీత యొక్క వాక్కు గలదో అది, అపాశమ్=అపగతమైన (సీత యొక్క) ఆశగల, మానాలీవాదేతానేజారా మేతమ్-మా=శోభగల, నాలీ(రీ) (అప్సరః)=స్త్రీ జనము యొక్క, వాద= సంవాదముగల, ఇత=పొందఁబడిన, అనేజ=అకంపితమైన, ఆరామ=తోటలుగల, ఇరాతమ్= భూధరముగల వాని ఆంజనేయుని (చేరెను).



**తాత్పర్యము:-** గానవల్లక్ష్మీచ్ఛావంతుడా!, ఇచ్ఛాతుడా!, శివుని కీర్తి వంటి కీర్తి గలవాడా!, ప్రకాశమందు ఆస్థలేని, అర్థము తెలియరాని సూక్ష్మమైన లోకమందు పాపరహితమైన, లక్ష్మ్యవతారమైన సీతను గూర్చిన వాక్కు, సీతావార్తయందు ఆశలుడిగిన, శోభావంతమైన అప్సరః స్త్రీ జనము యొక్క సంవాదములుగల పర్వతమందు చరించు ఆంజనేయుని సంపాతి చేరెను.

**వివరణము:-** అప్సరః సంవాదముల ధ్వనిలో కలసి సీత క్షేమముగా ఉన్నట్లు సంపాతి చెప్పినవాక్కు స్పష్టాస్పష్టముగా ఆంజనేయునకు వినఁబడెను. బుద్ధిమంతుడైన ఆంజనేయుడు దానిని స్పష్టముగా సీతా క్షేమమును గూర్చి చెప్పు దానినిగానే గ్రహించెను. అని అభానాస్థా శబ్దము వ్యంజింపఁజేయును.

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయాది వానరులకు సంపాతి దర్శనము కలుగుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆంజనేయుడు లంకను చేరుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ యోఖ్యాభానాస్థా మాకీ లోకానేనాధీనాధాశామా।**
**నాలీవాదేతానేజారామేరాతం దే యాపాశంగీ॥ 43**

**పదవిభాగము:-** యా-ఉ-భ్యాభానాస్థా మాకీ-లోకానే-అనాధీ-ఈ నాధాశామా-నాలీ-వాదేతా-అనేజా రామేరాతమ్-దే-య-ఆప-అసంగీ

**ప్రతిపదార్థము:-** లోకానే=లోకమున మన్మథ వికారము లేనివాడా!, దే= దానలక్ష్మిని పొందినవాడా!, ఖ్యాభానాస్థా-ఖ్యాభా=కీర్తికాంతులకు, అనాస్థా (న ఆస్థా)=స్థానము కాదో (ఆస్థానమో), మాకీ-మా=రాజ్యలక్ష్మిని, అకీ=కుటిలముగా పొందు రావణుని ఆ పురి, అనాధీనాధాశామా=విష్ణువు యొక్క ఆశానుగుణ సంపదయైన సీతగల (సీతకు ఆశ్రయమైనదో), నాలీ(రీ)వాదేతా=శత్రువుల వాగ్వాదముతో పొందఁబడినదో, అనేజారామేరాతమ్=చలించని తోటల భూములుగల దానిని(ఆ లంకను),అసంగీ=విష్ణుసంగి(భక్తుడు, ఆంజనేయుడు), ఆప=పొందెను.

**తాత్పర్యము:-** దానలక్ష్మిని పొందినవాడా!, లోకమున మన్మథ వికార

రహితుడా!, ఏ పురి కాంతికీర్తులకు ఆస్థానమో, ఆపురి(లంక) రాజ్యలక్ష్మిని కుటిలముగా పొందిన రావణునికి సంబంధించినదో, విష్ణ్వవతార శ్రీరామునికి, ఆశింపదగిన లక్ష్మియగు సీతకు ఆశ్రయమైన, శత్రువుల వాగ్వాదములు గల ఆ లంకను ఆంజనేయుడు చేరెను.

**వివరణము:-** ఖ్యాభానాస్థా అను సమాసమును ఖ్యాభాన+అస్థా అని లేక ఖ్యాభా న ఆస్థా అని రెండు విధములుగా విభజించి ఆస్థానము అని అర్థము చెప్పవచ్చును. అస్థ అనగా స్థానము కానిది. న అస్థా=స్థానము కానిది కాదు లేక, ఆస్థా అనగా ఆస్థానము. దానినే రెండు న-ఇన్ లతో సమాసము చేయగా ఆస్థానమే అను అర్థము వచ్చును. అట్లే అనాధీనాశామా అను సమాసమును అ+న+అధీన+ఆశామా అని విభజించి అధీనము కానిది కాదు అనగా అధీనమైనదే అను అర్థము చెప్పవచ్చును. లేక ఆ విష్ణువే (రాముడే) నాథుడుగా గలది. అనాధీ అనాధియైన ఈ అనగా లక్ష్మి. ఆమె యందుంచబడిన ఆశ అనాధీనాశ. దానియొక్క మా అనగా సంపద అని కూడా విభజించి అర్థము చెప్పవచ్చును. మాకీ అను పదము కుబేరునిదైన లంకను కుటిలముగా రావణునిచే ఆక్రమించుకొనఁబడినదను అర్థమును వ్యంజించును.

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయుని లంకాగమనము చెప్పబడినది. ఈ శ్లోకమున దానివలన ఆంజనేయునకు కల్గిన అనితర దుర్లభ కీర్తి వర్ణింప బడుచున్నది.

**శ్లో॥ ఖ్యాభానాస్థా మాకీలో కానేనా ధీనాధాశామానా।**
**లీవాదేతానేజారామేరా తం దేయాపాశంగీ యో॥** 44

**పదవిభాగము:-** ఖ్యాభానాస్థా-మాకీల-ఉ-కానేనాః-ధీనాధాశామానా -లీవాదేతా-అనేజారామా-ఇరా-తమ్-దేయ-ఆప-అశంగీ-యా-ఉ.

**ప్రతిపదార్థము:-** దేయ=దానలక్ష్మిగలవాడా! ఖ్యాభానాస్థా-ఖ్య=ఆకాశమే (అంగణముగా) గల, ఆభ=అంతట నక్షత్రములు (లేక వానికాంతిగల), అనాస్థా=స్థానమైన, మాకీల=బంధనస్థాన శంకువు లేని, కానేనాః-క=శీర్ష (శిఖర)ము నందు, అనేనాః=పాపులు లేని, ధీనాథాశామానా-ధీనాథ=బుద్ధి



ప్రభువు (మంతు)లను, ఆశ=పొందు, అమానా=మాన (పరిమితి) రహితమైన, ఆలీవాదా, ఆలీ=విటజనము గల, ఇ=మన్మథుని, వాద=ప్రసంగములుగల, అనేజారామేరా-అనేజ=చలించని స్త్రీలు గల, ఆరామ=మిక్కిలి మనోహరములైన, ఇరా=భూములుగలది, (లంక) (ఆంజనేయుని చేత), ఇతా=పొందఁబడినది, తమ్=హనుమంతుని, అసంగీ-అసంగి=(ఇతర) సంగములేని, ఈ=శోభ, ఆప=చేరెను.

**తాత్పర్యము:-** ఆకాశము నంటు సౌధోపర్యంగణములు గల నక్షత్రము లకు స్థానమైన బంధనార్థ శంకువులు లేని ఏకాంత పర్వత శిఖరమున బుద్ధిమంతులకు చేరరాని పరిమితిలేని విట జనసంచార వాదములు గల లంకను చేరిన ఆంజనేయుని ఇదివరకెవరు పొందలేని గొప్ప కాంతి చేరెను.

**వివరణము:-** పాపము లేనిదే జన్మ గలుగదు. పాపార్థకమైన ఏనశ్శబ్ద మంతమందుగల అనేనాః అనుశబ్దము జన్మరహితము అను అర్థమును బోధించును. జంతువులు ఉన్నను బోగార్థ దేహములే కావున తద్రహితమని అర్థము చెప్పనక్కఱ లేదు.

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయునికి లభించిన సముద్రలంఘన జనిత కీర్తి వర్ణింపబడినది. ఈ శ్లోకమున అతడు లంకయందు సీతను వెదకుట వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ భానాస్థామాకీలోకానేనా ధీనాధాశా మానాలీ ।**
**వాదేతానేజారామేరా తం దేయాపాశం గీయోఖ్యా॥** 45

**పదవిభాగము:-** భానాస్థామా-అకీలా-ఉ-కానేనా-ధీనాధాశా-అమానాలీ -వాదా-ఇతా-అనేజా-రామేరా-తమ్-దేయ-ఆప-అ-శమ్-గీయా-ఉఖ్యా

**ప్రతిపదార్థము:-** ఉ=ఓ, అ=విష్ణుతుల్యుడా!, గీయ=గానవల్లక్ష్మీవంతుడా, దేయ=దానవల్లక్ష్మీవంతుడా!, భానాస్థామా-భాన=ప్రకాశమునందు, న+ఆస్థా= యత్నాభావమున, అమా=పొందినవాని(హనుమంతుని)చేత, అకీలా-అకి=పాపుల యొక్క, ఇలా=భూమి, అమానాలీ=మానరహిత (వివస్త్ర) లైన స్త్రీల సమూహము

గల, కానేనాధీనాధాశా-కాన(ణ)=గుడ్డివాడైన, ఇన= ప్రభువైన, అధీనాధ=ధీరహితులైన వారియొక్క నాయకుని (రావణుని యొక్క), ఆశా=దిక్కు (స్థానము)ను, వాదా=గతినిచ్చు, అనేజారామేరా-అనేజ=కంప(దుఃఖము)లేని వారి, ఆరామేరా=తోటభూమి, ఇతా=పొందబడినది, తమ్=వాని(ఆంజనేయుని), ఉఖ్యా=శివుని కీర్తివంటి కీర్తి, శమ్=(సీత యొక్క) సుఖమును, ఆప=పొందెను.

**తాత్పర్యము:-** దానగాన లక్ష్మీవంతుడా!, ప్రకాశించుట యందు ఆస్థను పొందని వాడైన ఆంజనేయుని చేత మాన రహిత (వివస్త్ర)లైన స్త్రీల వరుసలను, గుడ్డి ప్రభువు బుద్ధిహీనుల ప్రభువును అయిన రావణుని స్థానము (ఇల్లు) నందు గతినిచ్చు శోకరహితమైన తోటభూమి యందు అనగా అశోకవన భూమియందు, ఆంజనేయుడు వెదకెను. ఆతనికి శివునికీర్తివంటి కీర్తి కలిగెను. సీతకు సుఖము కలిగెను.

**వివరణ:-** శోకమందఉను కంపింపఁజేయును. కంపార్థకమైన ఏజ శబ్దమిట శోకమును చెప్పును. అనేజ శబ్దము అశోకమును సూచించుట ద్వారా అనేజారామేరా అను సమాసము అశోకవన భూమిని వ్యంజింపఁజేయును. భాన మనగా బయటపడుట దానియందు ఆస్థ అనగా ఇష్టము. న అనగా లేదు. దానిని అమ్ అనగా పొందువాడు అను విభాగము గల భానాస్థామ్ శబ్దమిట దాగి సీతను వెదకగోరు ఆంజనేయుని చెప్పును. ఆ సమాసమునకు తృతీయా విభక్తి(ఆ) చేరగా భానాస్థామా అను రూపమేర్పడును.

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయుని సీతాన్వేషణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆతని సీతాదర్శనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ నాస్థామాకీ లోకానేనాధీనాధాశా మానాలీవా।**
**దేతా నేజా రామేరా తం దేయాపాశం గీయో ఖ్యాభా॥** 46

**పదవిభాగము:-**న-ఆస్థా, మాకీల, ఉ-క అనేన-అధీనాధాశా, అమానాలీ-వాదా-ఇతా-నేజా-రామేరా-తమ్-దేయాపాశమ్-గీయ-ఉ-ఖ్యాభా-(లేక)మానాలీ వాదా-ఇతా అని మానాలీవాదేతా శబ్దమును విభజింపవచ్చును.

**ప్రతిపదార్థము:-** క=శివతుల్యుడా! ఉ గీయ=ఓ గానలక్ష్మీవంతుడా, ఆస్థా,



అ=రామరూప విష్ణువునందు, ఆస్థా=ఆసక్తిగల, అధీనాధాశా-అధీన=స్వాధీనుని (రాముని)యందు, ఆధా=అతి పోషణమునందు, ఆశా=ఆశగల, అమానాలీ వాదా-అమాన=మాన రహితులైన, ఆలీ=వయస్యలయొక్క, వాదా=సల్లాపములు గల లేక, న=లేని, ఆలీ=సఖియొక్క, వా=ప్రాప్తి, దా=(ఆనందము) నిచ్చునది, కీలా=(రావణగృహమునకు అగ్ని) జ్వాల(సీత), ఇతా=పొందఁబడినది, నేజా=(న+ఇజా)=మన్మథవికార రహితయైన, ఖ్యాభా=ఖ్యాతితో ప్రకాశించునది, అనేనాః=పాపరహిత(సీత), అనేన=వీనిచేత, దేయాపాశమ్=దేయ+అపాశమ్=ఈయదగిన దానిని ప్రతిబంధ రహితముగా, తమ్=వానిని(ఆంజనేయుని) ప్రత్యభిజ్ఞా నాంగులీయకము నిచ్చుటలో ప్రతిబంధము లేని వానిని),ఇతా=పొంద బడినది.

**తాత్పర్యము:-** శివతుల్యుడా! ఓ గానలక్ష్మీవంతుడా! విష్ణు రూప రాముని దర్శనము గోరునట్టి, స్వాధీనుడైన రాముని అధిక పోషణము నందాసక్తి కల మాన రహితలైన స్త్రీల ప్రలాపములు గల (వినుచున్న) అవికృత మనస్కయైన అగ్నిజ్వాల వలె పవిత్రయైన సీత అభిజ్ఞానాంగులీయకము నిచ్చుటలో ఎట్టి ప్రతిబంధము లేని ఏకాంత ప్రదేశమున తెల్లవాఋజామున ఆంజనేయునకు కనఁబడినది.

**వివరణము:-** ద్వితీయ చతుర్థ పాదములలో (ధీనధాశామానాలీవా దేయా పాశంగీ యోఖ్యాభా) వృత్త్యను ప్రాసాలంకారమున్నది. సీత కీలగ రూపింపఁ బడినందున రూపకాలంకార మేర్పడియున్నది. దానిచేత ఆమె రావణా ప్రధృష్యత వ్యంజింపఁబడినది.

**అవతారిక:-** పై శ్లోకమున అశోకవనమునందున్న సీతాదేవి నాంజనేయుడు చూచుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ వనము నుండి అతడు లంకకు వచ్చుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్థామాకీ లోకానేనా ధీనాధాశా మానాలీ వాదే।**
**తా నేజా రామే రాతం దేయాపాశంగీ యోఖ్యాభానా॥** 47

**పదవిభాగము:-** స్థా-మా-కీ-లోకానేనాః-ధీనాధా-అ-ఆశా-మానాలీ-ఈవాదేతా-నేజాః-రామే-రాతం-దేయ-ఆప-అశంగీ-యా-ఉఖ్యా-భానా.

**ప్రతిపదార్థము:-** దేయ=దానలక్ష్మీవంతుడా!, స్థా=ఉనికి, మా=జ్ఞాన స్వరూపుడైన, కీ=ఆనంద స్వరూపుడైన, లోకానేనాః=లోకములలో పాపరహితుడై నట్టి, ధీనాధాః=ధీ-ఇన ఆధా+అః-ధీన=బుద్ధి ప్రభువుల యొక్క, ఆధా=పోషకు డైన, అ=విష్ణువు (విష్ణ్వతార రామచంద్రుడు), కీ=సుఖవంతుడు(గా నుండెను), మానాలి(రి)= ఓ లక్ష్మి! (సీతా), ఈవాదే=శోభాయుక్త సల్లాపమునందు, తా=ఆ, ఆశాః=ఆశలు, నేజాః=భయాది దోష రహిత (శుద్ధ)ములై, రామే=రామునందు (ఉన్నవి అని) ఆశ(స)ంగీ=ఆంజనేయుడు, విష్ణుకథల) ఆసంగము కలవాడై, రాతమ్=(సీతచే) ఈయఁబడినదాని (అభిజ్ఞాన చూడామణిని) ఆప=పొందెను, యా=ఏది, ఉఖ్యాభానా-ఉఖ్యా=శివుని కీర్తించువాని (రావణుని) యొక్క, ఆభానా=సంపూర్ణ ప్రకాశము గలదో (ఆ లంకను మరల) ఆప=చేరెను.

**తాత్పర్యము:-** ఓ సీతా! శ్రీరాముడు సత్తాజ్ఞాన సుఖయుక్తుడై యున్నాడు. ఆతడు బుద్ధి ప్రభువుల ఆపోషకుడైన విష్ణువు కదా!. నీతో శోభాయుక్త సల్లాపము నందలి ఆశలు ఆతని యందు శుద్ధములు. కావున సత్యములు అగును. అని విష్ణ్వవతార రామునితో ఆసంగము గల ఆంజనేయుడు చెప్పెను. సీత ఇచ్చిన చూడామణి రూపమైన అభిజ్ఞానమును స్వీకరించెను. ఏ పురి శివభక్తుడైన రావణుని ప్రకాశము కలిగియున్నదో ఆ లంకకు (అశోకవనము నుండి) ఆంజనేయుడు చేరెను.

**వివరణము:-** స్థామాకీ శబ్దములు శ్రీరాముని సత్యజ్ఞానానంద స్వరూప స్థితిని వ్యంజించుచునే ప్రస్తుతము శ్రీరాముడు సీతా విరహార్తుడైనను సీతతోడి పునస్సంగమ సల్లాపాదులందు తన ఆశలు సత్యములు కాగలవను విశ్వాసమున తాత్కాలిక మానస స్థిరస్థితి జ్ఞాన సుఖములను కూడా బోధించును. ధీనాధ శబ్దములోని ధీ+ఇన+ఆధా శబ్దములు స్వాధీనాంతఃకరుణులైన విష్ణుకథా సంగు లైన ఆంజనేయాది భక్తులను శ్రీరామ పరబ్రహ్మము కాపాడునని వ్యంజించును.

**అవతారిక:-** పై శ్లోకమున అశోకవనము నుండి ఆంజనేయుడు లంకకు చేరుట చెప్పబడినది. ఆంజనేయుని సీతాదర్శనానంతర కృత రాక్షస సంహారము చెప్పబడుచున్నది.



**శ్లో॥ మాకీ లోకానేనా ధీనాధా శామానాలీ వాదేతా।**
**నే జారామేరాతం దేయాపాశం గీయో ఖ్యా భానాస్థా॥ 48**

**పదవిభాగము:-** మాకీలః-ఆకానేనా ధీనాధాశామానాలీ-ఈవాదే-ఇత-అ-నే-జారామేరాతమ్-దేయ-ఆప-ఆశం-గీయః-ఉ-ఖ్యా-భానాస్థా.

**ప్రతిపదార్థము:-** మాకీలః=ప్రతిబంధము లేని, దేయ=దానలక్ష్మీవంతుడా, ఈవాదేతా-ఈ=లక్ష్మియొక్క, వాద=స్థిరీకరణమునందు, ఇత=ప్రసిద్ధుడా, అ=విష్ణో, అకానేనాధీనాధాశామానాలీ-అకాన(ణ)ః=గుడ్డికాని జాగరూకుడైన, ఇన=ప్రభువు (రావణు)నికి, అధీన=స్వాధీనమైన, ఆధా=ఆ పోషణముగల, ఆశా=స్థానము (లంక) యందు, ఆమానాలీ-ఆమా=అంతటి లక్ష్మిగల, నాలీ=తోరణ స్దంభము గల ద్వారముగల, ఆశమ్=(అన్నిదిక్కుల) వ్యాపించు, నేజా రామేరాతోమ్=నే (న+ఈః)=లక్ష్మీరహితుడైన, జార=జారుని, (రావణుని) అమ=పొందు, ఈర=ప్రేరేపించు, అతమ్=తిరుగుదానిని (జనమును), భానాస్థా =ప్రకాశమునకు స్థానమైన గీయః=(గీ+ఈ+య) గానవల్లక్ష్మీ (సీత) గలదానిని (అశోకవనమును) పొందిన, ఉ=శివుని(ఆంజనేయుడు), ఖ్యాః=కీర్తులను, ఆప=పొందెను.

**తాత్పర్యము:-** దానలక్ష్మిని పొందినవాడా! లక్ష్మీ స్థిరీకరణ ప్రసిద్ధుడా! విష్ణుతుల్యుడా!, ప్రతిబంధ రహితుడైన జాగరూకుడైన రావణ ప్రభువున కధీన మైన పోషణముగల లంకయందు శోభాయుక్త తోరణ ద్వార స్తంభము గల సీతారూప లక్ష్మీరహితుడైన జారుడైన రావణుని ప్రేరేపించుచు అక్రమ యుద్ధమునకై తిరుగు రాక్షస జనమును చంపి గానవల్లక్ష్మీరూప సీతనుఁజేరిన ఆంజనేయుడీ సప్తసైన్యాధిపతులను అక్షనామక రావణపుత్రుని చంపి కీర్తులను పొందెను.

**వివరణము:-** సీతను చూచి రమ్మని మాత్రమే శ్రీరాముడు ఆంజనేయుని ఆజ్ఞాపించినను దూతయైనవాఁడు ప్రభుకార్యావిరోధముగా తదనుకూలముగా తన సామర్థ్యమునకు అనుగుణమైన చర్యను చేయవచ్చును- అను రాజనీతి శాస్త్రాంశమును పురస్కరించుకొని శత్రు బలాబలమును తెలిసికొనదలచి

అశోకవనపాలక జనమును, రావణుడు పంపిన ఏడుగురు సేనాపతులను, ఆతని కుమారుడైన అక్షుని చంపెను. ఈ విధముగ దూత కృత్యము నొనర్చి కీర్తిని పొందెను. అని ఖ్యా శబ్దము వ్యంజించును. నేనాధీనాధాశామానా అను పద బంధమున వృత్త్యను ప్రాసమున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున హనుమత్కృతరాక్షస వధము చెప్పబడినది. ఈ శ్లోకమున ఇంద్రజిత్కృత బ్రహ్మాస్త్ర బంధముక్తి నాంజనేయుడు పొందుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ కీలోకానేనాధీనాధాశా మా నా లీవాదేతానే।**
**జారామేరాతం దేయాపాశంగీయో ఖ్యాభానాస్థామా॥ 49**

**పదవిభాగము:-** కీలః-అకానేనాధీనాధాశా మా నాలీవాదేతా-అ-జారా-మేరాతమ్-దేయాపాశమ్-గీయా-ఉఖ్యా-భానాస్థామా.

**ప్రతిపదార్థము:-** ఉ=ఓ, ఈవాదేత=రాజ్యలక్ష్మి స్థిరతా ప్రదత్వమున ప్రసిద్ధుడా!, అ=విష్ణుతుల్యా!, దేయ=దానలక్ష్మీవంతుడా!, కీల(ర)ః-కి=ఇంద్రుని (యుద్ధమునకే), ఈర=ప్రేరేపించువాడు, (ప్రేరేపించి ఇంద్రుని జయించు వాడు-ఇంద్రజిత్తు), అకానేనాధీనాధాశామానాలీ-అక=కుటిలముగా పోవుట (విరసమైన), ఆన(ణ)=ధ్వనిగల వారియొక్క (రాక్షసుల), ఇన=ప్రభువునకు (రావణునికి), అధీన=స్వాధీనమైన ఆధా=ఆపోషణముగల, ఆశా=స్థానము (లంక), మా=మానము గల, నాలీ=నరసంబంధి సమూహముగల వాడై, జారామేరాతమ్- జార=జారుని (రావణుని), ఆమా=అంతటి శోభగల, ఇరా= భూమిని, అతమ్= పొందినవానిని (ఆంజనేయుని), దేయాపాశమ్-దేయా= ఈయదగిన, ఆపాశమ్ =బ్రహ్మాస్త్ర బంధముగల, అశమ్=కష్టము కలుగు చున్నట్లుగా ఉన్న వానిని (ఆంజనేయుని) ఆప=చేరెను, గీయా=గానలక్ష్మిని పొందు, ఉ=శివుని (ఆంజనేయుని) ఖ్యా=కీర్తి, భానాస్థామా= ప్రకాశించు యత్నము లేనిదై ఉండెను.

**తాత్పర్యము:-** ఇంద్రజిత్తు విరసముగా ధ్వనించు రాక్షస రాజ రావణుని



అధీనమునందలి లంకావాసి. యోధసహితుడై జారుడైన రావణుని అంతట లక్ష్మిగల భూమిని పొందిన ఆంజనేయుని బ్రహ్మాస్త్ర బంధము తొలగినను కష్టమున్నట్లు కనిపించుచున్నట్లున్న వానిని ఆప=చేరెను. ఆ సమయమున ఆంజనేయుని కీర్తి ప్రకాశించు యత్నము లేనిదిగా ఉండెను.

**వివరణము:-** బ్రహ్మాస్త్రమున బంధించిన పిమ్మట మరల త్రాళ్ళతో బంధించినందున అవమానమును పొందిన బ్రహ్మాస్త్ర మాంజనేయుని విడచెను. అయినను ఆంజనేయు డావిషయము నెఱిగియు ఎఱుగనివానివలె రావణుని చూచు కోరికతో నటించుచుండెను. అని దేయాపాశ శబ్దము యొక్క ద్విరావృత్తి చేసికొనినచో అర్థము సిద్ధించును.

**అవతారిక:-**పై శ్లోకమున ఇంద్రజిత్కృత బ్రహ్మాస్త్ర బంధము చెప్పబడినది. ఈ శ్లోకమున ఇంద్రజిద్విజయమును రావణుడు చాటించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ లోకానేనాధీనా ధాశా మానాలీ వాదేతానేజా।**
**రామేరా తం దేయాపాశం గీయోఖ్యా భానాస్థా మాకీ॥ 50**

**పదవిభాగము:-** లోకాః-నేనాధీనాః-ధాశాః-మానాలీవాదేతానేజా-రామా-ఇరా-తమ్-దేయ-ఆప-అశం-గీయ-ఉ-ఖ్యాభానాస్థా-మాకీ.

**ప్రతిపదార్థము:-** ఉ=ఓ, దేయ=దానలక్ష్మి సమన్వితుడా!, గీయ=గానలక్ష్మి గలవాడా, ధాశాః=పోషణాశగల, లోకాః=జనులు, నేనాధీనాః-నేన=విధికి, అధీనాః =స్వాధీనులు, మానాలీవాదేతా-మాన=అభిమానము యొక్క, ఈ=వాక్కు యొక్క, వాదే=స్థిరకరణమునందు, ఇతా=ప్రసిద్ధమైన, అనేజా=కంపములేని, రామా=అందమైన, ఇరా=వాక్కు, అశమ్=దుఃఖమును, మాకీ=ఇంద్రుడు లేనివాడు (రావణుడు), ఖ్యాభానాస్థాః=ఖ్యాతి ప్రకాశన తాత్పర్యములను, ఆప= పొందెను.

**తాత్పర్యము:-** సాధారణముగా జనులందఱు విధికి లోఁబడిన వారే యైనను అభిమాన హేతువాక్కులను నిలుపుకొనఁబూనుదు రనుట ప్రసిద్ధము. అకంపన మనోహరమైన వాక్కు కష్టమును పొందును. (కలిగించును) ఇంద్రుడు

కూడ ఎవని ముందఱ (నిలఁబడి) లేడో అట్టి రావణుడు పుత్రకీర్తి ప్రతాపమును నగరమున ప్రకటించు తాత్పర్యము కలవాడై యుండెను.

**వివరణము:-** ఆంజనేయుడు బద్ధుడై, దుఃఖితుడై యున్నాడని రాక్షసులు పలికినారు. కాని ఆ వాక్కును ఆశమ్ అనగా పూర్తిగా సుఖమునే కలిగించెను అను వాక్యార్థము, ఆశమ్ అని విభజించిన సిద్ధించును.

**అవతారిక:-** పై శ్లోకమున రావణుని ఇంద్రజిద్విజయ ఘోషణము చెప్పబడినది. ఈ శ్లోకమున హనుమత్కృత లంకాదహనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కానేనా ధీనాధాశామా నాలీ వాదేతానేజారా।**
**మేరా తం దేయా పాశంగీయోఖ్యా భానాస్థామా కీలో॥ 51**

**పదవిభాగము:-** కానేనాధీనాధా-శామా-నాలీ-వాదేతా-అనేజారా-మేరా -ఇరా-తమ్-దేయ-ఆప-అశంగీయా-ఉ-ఖ్యాభానాస్థామా-కీలా-ఉ.

**ప్రతిపదార్థము:-** ఉ దేయ=ఓ దానలక్ష్మీవంతుడా, మేరా-మా=లక్ష్మి(సీత) యొక్క, ఇరా=వాక్కుగల, అశంగీయా-అశమ్=ప్రతిబంధములేని, గీ=కీర్తి యొక్క, ఈ=కాంతిని, ఈయా=పొందిన, ఉఖ్యాభానాస్థామా=ఉఖ్యా=శివ భక్తుడైన, ఇంద్రజిత్తు యొక్క, ఆభా=కాంతియందు, అనాస్థా=(న+న+ ఆస్థా:) ఆస్థగల (రాక్షసులనుండి) అమా=గతిగల, కీలా=(అగ్ని)జ్వాల, తమ్= ఆతని (ఆంజనేయు)ని, ఆప=పొందెను, నాలీ=నలము (గడ్డి, నూనె, గుడ్డ పేలికలు మొదలగు వానికి) సంబంధించిన, వాదేతా-వాద=స్థిరతను, ఇతా= పొందిన, అనేజారా-అనేజ=కంపించని, అరా=అగ్రభాగముగలది (అగ్నిజ్వాల) కానేనాధీనాధాశామా-క=స్వర్గముయొక్క, అనేన (న+న+ఇన)=ఇంద్రుడు కానివాడు కాని, ధ=ఇంద్రుడు, అధీన=స్వాధీనుడుగా గల వాని (రావణుని) యొక్క, ఆధా=పోషణముగల, ఆశా=స్థానము (లంక) యందు, అమా= గతిగలవాడు (ఆయెను).

**తాత్పర్యము:-** ఓ దానలక్ష్మీవంతుడా!, చల్లని వాడవు కమ్ము అను సీతావాక్కు గల, ప్రతిబంధ రహిత కీర్తికాంతులు గల శివభక్తుడైన రావణుని కాంతియందు ఆస్థ(శ్రద్ధ)గల రాక్షసుల నుండి ఆంజనేయుని చేరిన గడ్డి నూనె



గుడ్డపేలికలకు సంబంధించిన అనగా వాని వలన చలించక ప్రకాశించు కొనలు గల అగ్నిజ్వాల రావణుని లంకనే చేరిన దాయెను. (అనగా లంక కాలిపోయినది)

**వివరణము:-** సీతాదేవి శీతోభవ హనూమతః (ఆంజనేయునకు చల్లని వాడవుకమ్ము) అని అగ్నిని ప్రార్థించగా ఆమె పాతివ్రత్య ప్రభావము వలన చల్లఁ బడిన అగ్ని తన జ్వాలతో లంకను కాల్చివేసెను. లక్ష్మియొక్క వాక్కు అను వాచ్యార్థము గల మేరా శబ్దము వ్యంజించుచున్నది. ప్రభువు అను అర్థ మిచ్చు ఇన శబ్దమిట స్వర్గార్థక క శబ్దబలము వలన ఇంద్రుని బోధించును, నిషేధార్థకములైన న ఞ్ శబ్దమున శబ్దము పూర్వమందు గల అనేన అను శబ్దము కూడా ఇన్ద్రునే బోధించును. (రెండు నిషేధములొక విధిని బోధించును). అట్టి కానేనుడు(ఇంద్రుడు) రావణుని అధీనమునుండి యుండుటచే కానేనాధీన శబ్దము రావణుని బోధించును. ఆయన పోషణ మందున్న స్థానము అను అర్థమిచ్చు ఆధాశా శబ్దములతో కలసి కానేనా ధీనాధాశా అను సమాసము లంకను బోధించును. గత్యర్థకమైన చివరి అమా శబ్దముతో కలసి పై సమాసము అగ్ని జ్వాల లంకను చేరినది అను అర్థము నిచ్చును.

**అవతారిక:-** పై శ్లోకమున లంకాదహనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సీతాదేవి ఇచ్చిన అభిజ్ఞానమును ఆంజనేయుడు రహస్యముగా రామునికిచ్చుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నేనాధీనాధాశా మా నాలీ వాదే తానేజా రామే।**
**రాతం దేయా పాశంగీయోఖ్యాభానాస్థా మాకీలోకా॥ 52**

**పదవిభాగము:-** న+ఇనాధీనా-ఆధాశా-మా-నాలీ వాదేఅతానేజ- అ-తా-రామే-రాతమ్-దేయ-ఆప-అసంగీయా-ఉఖ్యాభానాస్థా-మాకీలోకా.

**ప్రతిపదార్థము:-** అతానేజ=అత్రికుల అభయముగల, అ=విష్ణుతుల్యుడా!, దేయ=దానవల్లక్ష్మీవంతుడా!, ఇన=ప్రభువు(రావణు)నకు, అధీనా= స్వాధీనురాలు, న=కాదు, ఆధాశా-ఆధా=(నీకు సంబంధించిన) ఆ పోషణము నందు, ఆశా= ఆశగలది, నాలీ=న+ఆలీ=సఖీరహిత, రామే=రామునికి సంబంధించి, వాదే= రచనము నందు (ఉన్నది), రాతమ్=(సీతచేత) ఈయ బడినది (అభిజ్ఞానము),

అఖ్యాభానాస్థా-అఖీ=లంకాపురము గల రావణుని, ఆభా=బాగుగా ప్రకాశించుట యందు, నాస్థా=ఆసక్తి లేని, అసంగీయా-అ= విష్ణువు యొక్క, సంగి= సంబంధము గల, ఈ=వాక్కును, య=పొందిన, మాకీలోకా-మా=లక్ష్మి(సీత) యొక్క, కీ=సుఖవంతమైన, ఈ= వాక్కుల యొక్క, లోకా=దర్శనముగల, (ఆంజనేయుడు), ఆప=తిరిగివచ్చెను.

**తాత్పర్యము:-** సీత రావణునకు లోబడలేదు. సఖీరహితయై యున్నది. నీ యొక్క పోషణము నందాశగలదైయున్నది. రామ సంబంధి వాక్కులనే చింతించుచున్నది. అని ఆమె నుండి తెచ్చిన అభిజ్ఞానముతో అంగదాది జనముతో పాటు స్త్రీలింగ శబ్ద దోధ్యుడు ఆంజనేయుడు తిరిగి వచ్చి రామునకు చెప్పెను. రామునకు ఏకాంతముగా అంగదాదులు చూడనప్పుడు, ఏకాంతముగా (శ్రీ రామేతరులు జీవులు పురుషులు కాకపోవుటచే ఆతడొక్కడే పురుషు డగుటచే) సీత ఇచ్చిన అభిజ్ఞానము నిచ్చెను.

**వివరణము:-** 1) అసంగీయా మాకీలోకా అను స్త్రీలింగ విశేషణము ఆంజనేయ విశేష్యముగా గలవిగా గమనింపదగినది. 2) ఖ శబ్దము శూన్యాకాశ వాచకము. అదిలేని పట్టణమును అఖ శబ్దము బోధించును. దాని యందు రావణుని ప్రకాశమునందు అనగా ఆయన లంకాధిపత్యైశ్వర్యమునందు ఆంజనేయునకు ఆసక్తిలేదని అఖ్యాభానాస్థా శబ్దము బోధించును. ఆస్థలేమిచే -దాని నాంజనేయుడు కాల్చివేయుట న అఖ్యాభానాస్థామా శబ్దములు బోధించును. *





## యుద్ధ కాణ్డము

**అవతారిక:-** పై శ్లోకమున ఆంజనేయుడు శ్రీరామునకు సీత ఇచ్చిన అభిజ్ఞానము నప్పగించుట చెప్పబడినది. సైన్యసన్నాహము ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ నాధీనాధాశా మానాలీ వాదేతానేజా రామేరా।**
**తం దేయాపాశంగీ యో ఖ్యాభానాస్థా మాకీ లోకానే॥ 53**

**పదవిభాగము:-** నాధీనాధాశా-మానాలీ-వాదేతా-అనేజా-రామేరా-తమ్-దేయ-ఆప-ఆశ(స)ంగీయః-ఖ్యాభానాస్థా-మాకీలోకానే.

**ప్రతిపదార్థము:-** దేయ=దాన లక్ష్మి గలవాడా, లోకానే=లోకమున మన్మథవికారము లేనివాడా! నాధీనాధాశా-న+న+ధీనాధ+అశా=బుద్ధిమంతులను పొందువారు కానివారు కానివారు (బుద్ధిమంతులు), మానాలీ-మాన= చిత్తసమున్నతి యొక్క, ఆలీ=వరుసగల, వాదేతా-వాద=స్థైర్యమును, ఇతా= పొందిన, అనేజా=కంపరహితమైన, రామేరా-రామ=రామ యొక్క, ఇరా=వాక్కు, యః=ఎవడు(సుగ్రీవుడు), ఖ్యాభానాస్థా=కీర్తి ప్రకాశనస్థానమో, మాకీ=మా+అకి+ ఈ=దురితవాక్కులేనివాడో, ఆసంగీ=స్నేహముకలవాడో, తమ్=ఆ(ఆ సుగ్రీవుని), ఆప= పొందెను.

**తాత్పర్యము:-** దానలక్ష్మి గలవాడా!, లోకమున పాపరహితుడా!, ఎవడు, దురితవాక్కు లేనివాడో, స్నేహము కలవాడో, కీర్తిప్రకాశస్థానమో ఆ సుగ్రీవుని, బుద్ధిమంతులను పొందు కంపనములేని స్థైర్యమును పొందిన రాముని వాక్కు పొందెను.

**వివరణము:-** ఆప అని అప అని ద్విధా విభాగమున అపాశంగీయ అను పదమును ఆవృత్తము చేసికొని అర్థము చెప్పుకొనవలెను. సుగ్రీవుడు ప్రతిబంధము లేని వాక్కుగలవాడు కావున సైన్యసన్నాహము చేయబడినది అను అర్థము తెలియబడును.

**అవతారిక:-** పై శ్లోకమున లంకాదండయాత్రాసన్నాహము చెప్పఁబడినది. శ్రీరామసేన సముద్ర తీరము చేరుట ఈ శ్లోకమున చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ధీనాధాశా మానాలీ వాదేతానేజారామేరా తమ్।**
**దేయా పాశంగీయోఖ్యాభానాస్థా మాకీ లోకానేనా॥ 54**

**పదవిభాగము:-** ధీనాధ-ఆశామానాలీ-వాదేతా-అనేజారా-మేరా-తమ్-దేయ -ఆప+ఆశమ్-గీయ-ఉఖ్య-అ-ఆభానాస్థా-మాకీలః-అక-అనేన-అ.

**ప్రతిపదార్థము:-** ఉఖ్య=శివుని కీర్తివంటి కీర్తి గలవాఁడా!, అ=విష్ణు తుల్యుడా!, దేయ=దానలక్ష్మిగలవాడా!, గీయ=గానయోగ్య లక్ష్మి గలవాడా!, ధీనాధ=బుద్ధి ప్రభూ!, అనేజారామేరా-అనేజ=(పర్వతముల కంపములేనివాని) యొక్క, ఆరామ=తోటల యొక్క, ఇరా=స్థానముగల, వాదేతా-వా=గమన (ఉత్సవ)మును, ద=ఇచ్చు దానిని, ఇతా=పొందిన, ఆశామానాలీ-ఆశా=దిక్కు లందు, మాన=చిత్తములుగలవారి వరుసగలది, ఆలీ=సకల వానర సమూహము, తమ్=రాముని, ఆశమ్=పూర్ణ సుఖము గలుగునట్లుగ ఆప= పొందెను, అక=సీతావిరహజన్య దుఃఖముగలది, అనేన=రామునిచేత, మాకీల- మా=లక్ష్మి, క=విష్ణువులుగల, ఇర=ఉదకములు గలది (సముద్రము), అభానాస్థా-ఆభాన= (చాక్షుష) జ్ఞానము యొక్క, స్థా=స్థానముగా చేయఁబడినది.

**తాత్పర్యము:-** విష్ణుతుల్యుడా!, దానవల్లక్ష్మీ యుక్తుడా! ప్రతిబంధము లేని కీర్తిని పొందువాడా!, శివుని ఖ్యాతి వంటి ఖ్యాతి గలవాడా! బుద్ధికి ప్రభువైన వాడా! పర్వతములకు తోటలకు స్థానమైన సముద్రతీరమునకు చేరిన అఖిల వానరచమూసమూహమునకు లక్ష్మీనారాయణులే యుదకమందు గలరో ఆ యుదకములుగల సముద్రము కనఁబడెను.

**వివరణము:-** న అనగా అభావము అది లేనిది అనము. బ్రహ్మ స్వరూపుడైన రామునిచేత అనునది అనేన అను శబ్దమునకు అర్థము. ప్రపంచమునకు సత్త అనగా ఉనికి లేదు. బ్రహ్మయొక్క సత్త చేతనే అది ఉన్నట్లు ప్రకాశించుచున్నది. అనగా బ్రహ్మమే జగముగా కనఁబడుచున్నది. కావున ప్రపంచము త్రికాలములందు లేనిదే బ్రహ్మమునకు అభావము



(లేకపోవుట అనునది) లేదు. కావున అన శబ్దము పరబ్రహ్మస్వరూపుడైన విష్ణ్వవతారమైన శ్రీరాముని బోధించును.

**అ:-** పై శ్లోకమున దక్షిణసముద్రతీరమున శ్రీరాముడు సుగ్రీవాదులతో విడియుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున విభీషణాగమనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నాధాశా మానాలీవాదేతానేజారామే రాతం దే।**
**యాపాశం గీయోఖ్యాభానాస్థా మాకీ లోకానేనాధీ॥ 55**

**పదవిభాగము:-** నాధాశా-మానాలీవాదే-తా-అనేజా-రామే-రాతమ్-దే-యా-అపాశమ్-గీయ-ఉఖ్యాభానాస్థా-మాకీ-లోకానే-అనాధీ.

**ప్రతిపదార్థము:-** మాకీ=దుఃఖములేని (సుఖమైన) వాక్కుగలవాడా!, లోకానే=లోకమున మన్మథ వికారము లేనివాడా!, అనాధీ=గొప్ప బుద్ధి గలవాడా!, మానాలీవాదే=(మా+నారీ+ఈ+వాదే)ఈమె లక్ష్మియేయను వాగ్వాదము గలవాని(విభీషణుని)యందు, రామే=రాముని యందు, నాధాశా=ప్రభువు అను ఆశ, రాతమ్=(అభయము) ఈయఁబడినది, యా=ప్రయాణము, అపాశమ్= ప్రతిబంధ రహితముగా (సాగెను), ఉఖ్యాభానాస్థా=శివునికీర్తి జ్ఞానములందు, ఆస్థా=(ఆంజనేయుని) మర్యాద, గీయా=గానవద్వాక్యమును పొందినది (ఆయెను)

**తాత్పర్యము:-** సీతాదేవిని గూర్చి సద్ వాదము చేసిన కారణమున రావణునిచే వెడలగొట్టఁబడిన విభీషణుడు రాముని శరణుజొచ్చెను. తన అభిప్రాయమును ఆంజనేయుడు బలపరచుటచే శ్రీరాముడు అభయ మొసంగెను. వానరచమూ సమూహ ప్రయాణము నిష్ప్రతిబంధముగ సాగెను. విభీషణుని పరోపకార పరాయణత్వమును సుగ్రీవాదులు ప్రశంసించిరి.

**వివరణము:-** నాధాశా శబ్దము సీతాదేవి విషయమున నాథుని సమీపించు నాశ అను అర్థమును విభీషణుని విషయమున లంకా రాజ్యము రావణుని నుండి యిప్పించగల నాథుడుగా రాముడు నాథత్వము నంగీకరింపగలడను ఆశ అను అర్థమును ఇచ్చుచున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున శరణాగతుడైన విభీషణునకు శ్రీరాముని అభయప్రదానము సూచింపఁబడినది. ఈ శ్లోకమున సేతుబంధము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ధాశామానాలీ వాదేతానేజా రామేరాతం దేయా।
పాశంగీ యోఖ్యాభా నాస్థా మా కీ లోకానే నాధీనా॥ 56**

**పదవిభాగము:-** ధాశా-అమానాలీ-(అమానా+ఆలీ)-వాదా-ఇతా-అనేజా-రామేరాతమ్- దేయాపా-అశంగీయా-ఉ-ఖ్యాభానాస్థా-మా-కీలోకానే నాధీనా.

**ప్రతిపదార్థము:-** ధాశా-ధా=(రావణ)పాలనమును, శా=కృశింపఁజేయు, అమా=విష్ణులక్ష్మి, నాలీ=నలు(నలనామవానరు)నకు సంబంధించిన, వాదా=స్థిరతగల, అనేజా=కదలనిది, అమానా=కొలతలేనిది (పెద్దది), ఆలీ=సేతువు, రామేర-రామ=నల్లని, ఇర=ఉదకము కల దానిని (సముద్రమును), అతమ్=పొందినది లేక, రామేరా=నల్లనిభూమి గల సముద్ర దక్షిణ తీర భూమిని, అతమ్=పొందినది, పాశంగీయా=పా=(నీ) పాలనము నందు, అసంగి=అసంగము గల (ప్రతిబంధములేని), ఈ=వాక్కును, యా= పొందు, ఖ్యాభానాస్థా-ఖ్యా=ఖ్యాతిని, అభ=ప్రకాశింపఁజేయు, ఆశా=ఆశ గల, మా=లక్ష్మి(సీత), దేయా=ఈయ దగినది (అను), కీ=సుఖింపఁజేయు వాక్కు, లోకానే-లోక=లోకము నందు, ఆనె(ణె)=శబ్దము గలవాని (రావణుని) యందు, నాధీనా=న అధీనా= అధీనము కానిదయ్యెను.

**తాత్పర్యము:-** రావణ పాలనమున కృశింపజేయునది, కదలకుండ స్థిరముగ నుండునట్టి సేతువు శ్రీరాముని వాక్కును సముద్రము యొక్క ఉభయ తీరములను కలిపినది. సీత రామునకప్పగించదగిన దను వాక్కు రావణునకు సుఖమును కలిగించునది కాకుండెను.

**వివరణము:-** మానాలీ శబ్దము మూడుసార్లు ఆవృత్తము నొనరించి అర్థము చెప్పఁబడినది. వా శబ్దము గమనార్థకము. దా శబ్దము ఖండించునది అను అర్థము గలది. కావున వాద శబ్దము గమనఖండనము అనగా స్థిరతను బోధించును.



**అవతారిక:-** పై శ్లోకమున సముద్రమున వానరులు వంతెనకట్టుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున వారు శ్రీరామ సహితముగ లంకను చేరుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శామానాలీ వాదేతానే జారామే రాతం దేయాపా।
శంగీ యోఖ్యాభానాస్థామా కీ లోకానేనాధీ నాధా॥ 57**

**పదవిభాగము:-** శామానాలీ-వాదా-ఇతా-నేజారామేరాతమ్-దే-య-ఆప-ఆశంగీ-యా-ఉ-ఖ్యాభానాస్థామా-కీ-లోకా-ఆనేన-అధీ-నాధా

**ప్రతిపదార్థము:-** ఉ దేయ=ఓ దానవల్లక్ష్మీవంతుడా!, వాదా=స్థైర్యముగల, శామానాలీ-శ(స)అమాన=విష్ణు (రాము) మానముతో సహితుడైన వాని (సుగ్రీవుని), ఆలీ=పంక్తి (సేన), నేజారామే రాతమ్, నే=మన్మథవికారము లేనిదాని (సీత) యందు, జార=వ్యభిచరించు కోరికగలవానిని (రావణుని), అమ=పొందినదాని యందు, ఈ=కాంతిగల, యా=ఏది(లంక), ఖ్యాభానాస్థామా=ఖ్యాతిప్రకాశన యత్నమును పొందిన, కీలోకా-కీ(విష్ణుపత్ని), సీతయొక్క, లోక=దర్శనముగల, ఆనేన (ఆణేన)=శబ్దముగల వాని (రావణుని) చేత, న+అధీ=నాధీ=అధీ=బుద్ధి లేనివాడు (మూర్ఖుడు), నాధా=భర్తగలది, తమ్=దానిని, ఆప=పొందెను.

**తాత్పర్యము:-** ఓ దానవల్లక్ష్మీవంతుడా! స్థైర్యముగల, రాముని సన్మానము నొందిన సుగ్రీవునిసేన మన్మథవికారము లేని సీత యందాసక్తి నొంది వ్యభిచరించు బుద్ధిగల రావణుడు భర్తగా అనగా ప్రభువుగా గల పట్టణమైన లంకను చేరెను.

**వివరణము:-** అధీనాధా అనునది లంకా విశేషణము అధీ అనగా మూర్ఖుడైన రావణుడు. వాడు నాథుడుగా గలది అను అర్థమున ఆ శబ్దము లంకకు ప్రస్తుత ప్రభువైన రావణుని మూర్ఖుడని చెప్పుచున్నది. శామానాలీ సమాసములోని శ శసయోరభేదః అను సూక్తిని పురస్కరించుకొని సహ భావమును బోధించును. అ అనగా (రాముడు). ఆతని మానము గౌరవముతో

కూడిన అనగా గౌరవమును పొందిన సుగ్రీవుని శామాన శబ్దము బోధించును. ఆలీ శబ్దము పఙ్క్త్యర్థకమైనను ఇట సైనికుల వరుసయైన సేనను బోధించును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామవాదుల లంకాప్రాప్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున రావణవధానంతరము విభీషణుని రాజ్యప్రాప్తియు సూచింపఁ బడుచున్నది.

**శ్లో॥ మానాలీ వాదేతానేజా రామే రాతం దేయాపాశమ్।**
**గీయో ఖ్యాభానాస్థా మాకీ లోకానేనాధీనాధాశా॥ 58**

**పదవిభాగము:-** మానాలీ-వాదే-ఇతా-అనేజా-రామే-రాతమ్-దేయ-ఆప-అశమ్-గీయ-ఉ-ఖ్యాభానాస్థా-మా-అకీ-లోకా-అనేన-అధీనాధాశా.

**ప్రతిపదార్థము:-** మానాలీ-మా=లక్ష్మి (సీత) యందు, ఆన(ణ)ః=శబ్దము లేక ప్రాణము గలవాని (రావణుని), ఆలీ=వరుస (సేన), అనేజా= కంప రహితయై, ఇతా=వచ్చినది, రామే=రాముడు, వాదే=స్థిరుడు కాగా, అశమ్=దుః ఖమును, ఆప=పొందెను, ఉ గీయ=ఓ గానవల్లక్ష్మీవంతుడా!, అకీలోకా-అకి= దుఃఖము గల, ఈ=(రాజ్య)లక్ష్మి యొక్క, లోకా=ప్రకాశముగల, అధీనాధాశా -అధీ=మూర్ఖులకు, నాధ=ప్రభువు (రావణుని) యొక్క, ఆశా= (దక్షిణ) దిక్కు, ఖ్యాభానాస్థా=ఖ్యాతిప్రకాశన యత్నము గలది (ఆయెను), అనేన=వీని(రాముని) చేత, మా=లక్ష్మి, ఇతా=పొందఁబడెను.

**తాత్పర్యము:-** ఓ దానవద్, గానవల్లక్ష్మీవంతుడా!, సీతయందు రాముని రప్పించినది అను క్రోధ శబ్దము లేక ప్రాణముగల రావణుని సేన నిర్భయము గానే వచ్చినను-రాముడు స్థిరముగా ఉండుట చేత - దుఃఖమును మృత్యువును పొందెను. దక్షిణ దిక్కుమూర్ఖ ప్రభువు (రావణుడు) గలదై రాముని ఖ్యాతినే ప్రకాశించు యత్నము గలదయ్యెను. రాజ్యలక్ష్మియు అట్టిదే అయ్యెను.

**వివరణము:-** రావణునికి సేనానాశముచే గలిగిన దుఃఖము రామునికి దానిచే కలిగిన కీర్తి లక్ష్మీప్రాప్తి ఇందు భాసించుచున్నది.

**అవతారిక:-** పై శ్లోకమున రావణవధ సూచింపఁబడినది. ఈ శ్లోకమున రావణుని అంతిమసంస్కారము సూచింపఁబడుచున్నది.



**శ్లో॥ నాలీవాదేతానేజారామే రాతం దేయాపాశంగీ।**
**యోఖ్యాభానాస్థామాకీ లోకానేనా ధీనాధాశామా॥ 59**

**పదవిభాగము:-** న-ఆలీ-ఈవాద-ఇతా-అనేజా-ఆర-ఆమే-రాతమ్-దేయాపా-శమ్-గీ-యా-ఉ-ఖ్యాభానాస్థా-మాకీ-లోకానేనా-ధీనాధా-ఆశా-మా.

**ప్రతిపదార్థము:-** అనే=పాపరహితుడా!, దే=దానలక్ష్మి గలవాడా!, ఈవాద=లక్ష్మిస్థైర్యము గలవాడా, (రాముడు), ఆమే=వచ్చినవాడు కాగా, రాతమ్=ఖండింపఁబడిన, దేయ+ఆప+అశమ్=దేయాపాశమ్=ఈయదగిన నీటి సమూహము గలవారిని (పితృదేవతలు), అశమ్=వ్యాపించువాని(రావణు)ని, గీ=గానవల్లక్ష్మిగలదై, అమే=అమా+ఈ=అలక్ష్మి గల, ఖ్యాభానాస్థా=ఖ్యాతి ప్రకాశయత్నము గల, కానే(ణే)నా=(కాణ+ఇనా) గుడ్డి (మదాంధుడైన) భర్తగల, నాలీ(రీ)=స్త్రీ (మండోదరి), అనేజా=కంపరహితయైనది, రాతమ్=ఖండింపఁ బడిన, ఆర=చేరినది, అధీనాధాశా-అధీ=విష్ణువు నందు బుద్ధి గలవాడు (విభీషణుడు), నాధా=భర్తగా గలది (విభీషణుని భార్య), మా=(రాజ్య) లక్ష్మిగల, ఆశా=దిక్కుగలది (విభీషణుని), ఇతా=పొందినదయ్యెను.

**తాత్పర్యము:-** రాముడు రావణునిచంపగా వైధవ్యము నొందిన మదాంధ రావణుని భార్య భయ పాపరహితయై మృతరావణ స్థానము చేరెను. విభీషణుడు భర్తగలదై దక్షణ దిక్కు విభీషణుని పొందినది.

**వివరణము:-** వైధవ్యము నొంది తన తప్పులవలననే మృతినొందిన రావణుని కొఱకు దుఃఖించినను విభీషణ రాముల సౌజన్యము నెరిగిన మండోదరి భయరహితగానే ఉండెనని అనేజా శబ్దము వ్యంజించును.

**అవతారిక:-** పై శ్లోకమున మండోదరి భయరాహిత్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సీతాగ్నిప్రవేశానంతరము శ్రీరాముడు సీతాలక్ష్మణరాక్షసవానర సహితుడై అయోధ్యకు చేరుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ లీ వాదేతానేజా రామేరాతం దేయాపాశంగీయో।**
**ఖ్యాభానాస్థా మాకీలోకానేనాధీనాధాశామానా॥ 60**

**పదవిభాగము:-** వాద-ఇతా-అనేజ-ఆర-ఆమేరాతమ్-దేయాప-ఆశం-గీ-ఈయ-ఉఖ్యా-భానాస్థామ్-ఆకీలః-అ-క-అనేన-ధీనాధా-ఆశామ్-అనాలీ.

**ప్రతిపదార్థము:-** అ=విష్ణుతుల్యుడా!, క=ఆనందస్వరూపుడా, ఉఖ్యా=శివుని కీర్తి వంటి కీర్తి గలవాడా!, అనేజ=అకంపనుడా!, వాదేత=(వాద+ఇత)=స్థిరతను పొందినవాడా!, ఈయః=లక్ష్మిని పొందివాడు (రాముడు), దేయాపాశ(స)ంగీ-దేయాప=దేవర్షి పితృదేవతల యొక్క, ఆసంగీ=సల్లాపముగలవాడై, కీల(ర):-కి=సుగ్రీవుని, ఈర=పొందినవాడై, అనేనాః=(రామేశ్వర ప్రతిష్ఠచే) పాపరహితుడై, ధీనాధా=బుద్ధిశాలియైన, నారీ(లీ)=నరసమూహముగల, ఆశామ్=దిక్కును పొందిన, భానాస్థామా-భా=నక్షత్రములందు, అనాస్థా=(న+న+ఆస్థా)=ఆస్థలను, అమ్=పొందినవాని (ఆకాశయానమైన పుష్పక విమానము)ని, అఖ్యాః=న+ఖ్యా=సుఖముకోరని లక్ష్మణ భరతులతో గూడినదని (నందిగ్రామము నుండి),ఆమేరాతమ్=ఆ+మా+ఇరా+అతమ్=సంపూర్ణలక్ష్మి స్థానము (అయోధ్య) యొక్క గమనము గలవాడై, ఆర=పొందెను.

**తాత్పర్యము:-** స్థిరతగలవాడా!, కంపము లేనివాడా! విష్ణుతుల్యుడా, ఓ ఆనంద స్వరూపుడా, సీతను పొందిన రాముడు దేవర్షి పితృదేవతలతో మాట్లాడిన పిమ్మట పుష్పక విమానము పై నెక్కి సుగ్రీవ సహితుడై రామేశ్వర ప్రతిష్ఠానంతరము భరతలక్ష్మణులతో నంది గ్రామమునుండి అనురాగమున ప్రజలెదిరి చూచుచుండగా అయోధ్యకు చేరెను.

**వివరణము:-** సీతాగ్ని ప్రవేశానంతరము దేవర్షులు దశరథాది పితరులు అగ్ని శుద్ధయైన సీతను చేకొనుమని చెప్పిన మాటలు దేయాపాశంగీ అను సమాసములోని ఆసంగ శబ్దముచేత వ్యంజింపఁజేయఁబడును.

**అవతారిక:-** పై శ్లోకమున సీత యొక్క అగ్నిశుద్ధి చెప్పబడినది. ఈ శ్లోకమున శ్రీరాముడు సీతాలక్ష్మణ భరత సమేతముగా అయోధ్యకు చేరుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ వాదేతానే జారామేరాతం దేయా పాశంగీయోఖ్యా।**
**భానాస్థామాకీలోకానేనా ధీనా ధాశా మానాలీ॥** **61**



**పదవిభాగము:-** వాదేత-అనేజ-ఆర-ఆ-మేరాతం-దేయా-పాశ(స)ంగీ-ఈయః-అ-ఖ్యా-భానాస్థామా-కీల(ర)ః క-అనేనాః-ధీనా-ఆధా-ఆశా-మా-నాలీ(రీ).

**ప్రతిపదార్థము:-** అనేజ=కంపరహితా, వాదేత=వాదమునందు పొందబడినవాడా, ధీనాథ=బుద్ధిశాలీ!, క=సూర్యతుల్యుడా!, ఈయః=లక్ష్మిని పొందినవాడు (శ్రీరాముడు), దేయాపాశంగీ-దేయాప=దేవర్షి పితృదేవతలతోడి, ఆశం(సం)గీ=సల్లాపము కలవాడై, కీల(ర)ః-కి=సూర్యపుత్రుని (సుగ్రీవుని), ఈరః=పొందినవాడై, అనేనాః=పాపరహితుడై, నారీ=నరసమూహము గలవాడై, ఆశామా=దిక్కులలో పోవు, భానాస్థామా-భ=నక్షత్రముల యొక్క, అనాస్థామా-(న+న+ఆస్థా)=ఆస్థలేమి లేనిదాని (ఆస్థ అనగా ఉనికి ఆకాశము)నందు, అమా=తిరుగుదాని (ఆకాశయానమైన పుష్పక విమానము)తో, అఖ్యా-(ఖి=సుఖమును కోరువాడు) అఖీ=సుఖమును కోరనివాడు, అభ్యా=సుఖమును కోరనివాని (లక్ష్మణుని లేక భరతుని)తో కూడి, అమేరాతమ్-ఆమా=అంతట రాజ్యలక్ష్మి గల, ఇరా=భూమి (స్థానము)కి (అయోధ్యకు), ఆతమ్=ఆగమనమును, ఆర=పొందెను.

**తాత్పర్యము:-** ఓ బుద్ధిశాలీ! సత్పురుషుల వాదమునందు పొందబడినవాడా! కంపరహితుడా! లక్ష్మ్యవతారమైన సీతను పొందిన విష్ణ్వతారమైన శ్రీరాముడు దేవర్షి పితృదేవతలు సీతను పరిగ్రహింపు మను సల్లాపమును వినినవాడై సీతను పరిగ్రహించినవాడై శ్రీరామేశ్వర ప్రతిష్ఠచే పాపరహితుడై ప్రజలు అనురాగమున తమను గూర్చి మంచి మాటలు పలుకు చుండగా వినుచున్నవాడై ఆకాశమున నన్ని దిక్కులలో పోగల పుష్పకవిమానము లంక నుండి, సీతా లక్ష్మణులతో నందిగ్రామము నుండి భరతునితో కూడి అయోధ్యకు చేరుకొనెను.

**వివరణము:-** అఖ్యా శబ్దము అఖి శబ్దము యొక్క తృతీయాంతము. సఖి శబ్ద సదృశముగా ప్రయోగింపఁబడినది. అట్లే 'భానాస్థామా' అనునదియు మకారాన్తమైన భానాస్థామ్ శబ్దము యొక్క తృతీయాన్తము అట్లే దానికి విశేషమైన ఆశామా అను శబ్దము ఆశామా అను శబ్దము ఆశామ్ శబ్దము యొక్క తృతీయాన్తము.

అవతారిక:- పై శ్లోకమున శ్రీరాముడయోధ్యకు చేరుట చెప్పఁబడినది.

ఈశ్లోకమున శ్రీరామపట్టాభిషేకము మునుల శుభకాంక్షావచనముచే వ్యక్తము చేయఁబడుచున్నది.

**శ్లో॥ దేతానేజా రామేరా తం దేయాపాశంగీయోఖ్యాభా।**
**నాస్థామాకీ లోకానేనా ధీనాధాశామా నాలీవా॥ 62**

**పదవిభాగము:-** దేతా-అనేజా-రామేరా-తమ్-దేయా-ఆప-అశంగీయ-ఉ-ఖ్యాభా-అనాస్థా-అమాకీలః-అకానేనాః-ధీనాధాశామా-న-అలీ(రీ)వా.

**ప్రతిపదార్థము:-** దేతా-దా=స్వత్యాగమును, ఇతా=పొందిన, అనేజా=కంప రహితమైన, అశంగీయోఖ్యాభా-అసంగి=సంతతిగల, ఈయ=వాక్కునుపొందిన ఉఖ్యా=పురోగాశాది పాత్రల యొక్క కాంతి గలవాని (యాగముల), ఆభా= కాంతిగల, ఆమా=సంపూర్ణలక్ష్మిగల, దేయా=(మరల) ఈయదగిన, ఇరా= భూమి, తమ్=వాని(రాము)ని, ఆప=పొందెను, ఆస్థాః=ఆస్థగలవారు(మునులు), మాకీలః=(మాకి+ఈల)=శ్రీయుక్త విష్ణు ప్రేరణగల, అకానేనాః-అక=విష్ణువు, అనేనాః=(న+న+ఇనాః)=ప్రభువు కాని వారు కాని (రాముడే ప్రభువుగా గల వానరులు), ధీనాధాశామాః-ధీనాధ=బుద్ధిప్రభువుల (మంత్రుల) యొక్క, ఆశా=ఆస్థానమును, ఆమాః=(చేరువారి), అరీవా=శత్రువుల యొక్క, ఈః= వాక్కు యొక్క, వా=గతి, న=లేదు.

**తాత్పర్యము:-** స్వత్యాగమును పొందిన కంపరహితమైన పురోడాశాది పాత్రలతో కూడిన యాగములతో పూర్ణమైన శోభగల, తిరిగి ఈయదగిన భూమి రామునికి (భరతునుండి) సంక్రమించెను. రామాభిషేకాస్థ గల మునులు సుగ్రీవాది కపులు శుభాకాంక్షావచనులైరి. బుద్ధిమంతులైన మంత్రులుండుటచే మాట వరుసకైన శత్రుగమనము లేకుండెను.

**వివరణము:-** మాకీల(ర) శబ్దములోని మాక శబ్దములు లక్ష్మీనారాయణుల సంబోధించును. వారు కల వాక్కు మాకీ అని చెప్పఁబడినది. దాని చివరి ప్రశ్లిష్టమైన ఈకారము వాక్కును బోధించును. దానికి మరొక ఈకారమును ప్రశ్లిష్ట మొనరించగా నేర్పడు ఈర్ శబ్దము ప్రేరణమును చెప్పును. ఇట్లు ఏర్పడిన మాకీర్ లక్ష్మీనారాయణుల వాక్ప్రేరణగల వ్యక్తిని బోధించును. అది



బహువచన యుక్తమై మాకీరః అని యేర్పడును. అది విష్ణు ప్రేరిత వాక్కులు గలవారిని బోధించును. అ శబ్దము విష్ణువాచకము. దానికి స్వార్థక ప్రత్యయము చేరగా అక అని యగును. అదియు అ శబ్దము వలె విష్ణ్వర్థకమే. అది ఇచట విష్ణ్వవతార రామ వాచకము.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరాముని రాజ్యపట్టాభిషేకము సూచింపఁ బడినది. ఈ శ్లోకమున రామరాజ్యవైభవము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ తానేజారామేరాతం దేయాపాశంగీ యోఖ్యాభానా।**
**స్థామాకీలోకానేనాధీనాధాశామానాలీ వాదే॥ 63**

**పదవిభాగము:-** తానే-అజారామే-అరాతమ్-దేయా-ఆప-అశంగీయా-ఉ-ఖ్యాభానా-స్థామాకీ-లోకాన్-ఏ-నాధీ-ఈన-అధాశా-ఆమానాలీవా-ఆదే.

**ప్రతిపదార్థము:-** ఏ=మన్మథతుల్యా!, ఆదే=మొదటివాడా!, దేయ!= దానవల్లక్ష్మిని పొందినవాడా!, తానే=సంగీతవిద్యయందు(సంగీత సాహిత్యాది సకల శృంగార విద్యలందు), అజారామే-అజ=బ్రహ్మయొక్క, ఆరామే= క్రీడాస్థల మైన, వాదే=సల్లాపమందు (సకల బ్రహ్మవిద్యా బోధక సకల వేద శాస్త్రము లందు), అరాతమ్=అఖండితముగా, అశంగీయా-అ=విష్ణువు యొక్క, సంగి= సంగముగల, ఈయా=శోభనుపొందిన, ఉఖ్యాభానా-ఉ=శివుని యొక్క, ఖ్యా= ఖ్యాతిని, భానా=ప్రకాశింపఁజేయు, ఈః=వాక్కు, లోకాన్=జనులను, ఆప= పొందెను, అధీ=బుద్ధిహీనురాలైన స్త్రీ, న=లేదు, అధా=అపోషణముగల, ఆశా= ఆశగల, అమా=అలక్ష్మిగల, నాలీ(రీ)=స్త్రీ, వా=కాని, న=లేదు.

**తాత్పర్యము:-** సంగీత సాహిత్యాది శృంగార విద్యలందు గాని, బ్రహ్మక్రీడా స్థానమైన సల్లాపముగల వేదశాస్త్రములందు గాని, అఖండితమైన విష్ణుసంగము గల శోభగల శివుని ఖ్యాతిని ప్రకాశింపఁజేయు వాక్కు లోకులను పొందెను. స్త్రీలలో బుద్ధిహీనురాలు గాని, అపోషణము గలది గాని అలక్ష్మిగలది గాని లేకుండెను.

**వివరణము:-** స్త్రీ శోభకు సౌమంగల్యము లేక సౌభాగ్యము అనగా సభర్తృకత్వము హేతువు గావున అమాశబ్దము స్త్రీ యొక్క అలక్ష్మి లేక అశోభ

అనగా దౌర్భాగ్యమును బోధించును. అట్టి అలక్ష్మిగల అనగా వైధవ్యముగల స్త్రీ ఒకటిగాని లేకుండెను అని బోధించును. రాముడు రాజ్యమునకు రాక ముందు దశరథుని రాణులు భర్తమరణించుటచే విధవలైన ఆయన భార్యలు ఉండవచ్చును. బుద్ధిహీనులు లేరు అను అర్థమిచ్చు న+అధీ అను భిన్నశబ్దముల కలయికయైన నాధీ ఏక శబ్దముగా స్త్రీ జనము యొక్క సనాథత్వమును వ్యంజించును.

**అవతారిక:-** పై శ్లోకమున శ్రీరామరాజ్యవైభవము చెప్పఁబడినది. ఈ శ్లోకమున కవి తనను తన కావ్యమును పఠించువారిని రక్షించుమని కోరుట సూచింపఁబడుచున్నది.

**శ్లో॥ నేజారామేరాతం దేయాపాశంగీ యోఖ్యాభానాస్థా।**
**మాకీ లోకానేనా ధీనాధాశా మానాలీ వాదేతా॥ 64**

**పదవిభాగము:-** నేజారామ-ఇరాతమ్-దేయ-అపాశంగీయః-అఖ్యాభానాస్థా-మాకీ-లోకానేనాః-ధీనాధాశా-మా-అనాలీవ-ఆదే-అత-అ.

**ప్రతిపదార్థము:-** నేజారామ-నే=(న+ఈ)=లక్ష్మీహీనుడైన, జార=జారుని (రావణుని), ఆమ=(యుద్ధముకొఱకు) పొందువాడా!, దేయ=దానవల్లక్ష్మిని పొందువాడా!, అనాలీవ!=కాలగోచరుడుకానివాడా!, ఆదే=ప్రథమపురుషుడా!, అపాశంగీయ=ప్రతిబంధరహిత లక్ష్మిని పొందినవాడా!, అ=విష్ణూ!, అఖ్యాభా నాస్థా=అకీర్తి అప్రతాపములందు, ఆస్థ లేనివాడవు, మాకీ=దుఃఖికాని వాడవు, లోకానేనాః=లోకమున కల్మషరహితుడవు, ధీనాధాశా=ధీ(సమాహిత) బుద్ధి ప్రభువుల ఆశయైన వాడవు(నైన నీవు), ఇరాతమ్-ఇరా=భూమిని, అతమ్=పొందిన వానిని, మా=నన్ను, అత=పొందుము (రక్షింపుము).

**తాత్పర్యము:-** యుద్ధార్థము, జారుడు, అలక్ష్మీకుడునైన రావణుని పొంది వానిని చంపినవాడా!, దానవల్లక్ష్మిని పొందువాడా!, కాలానవచ్ఛిన్నుడా!, ఆది పురుషా!, రామచంద్రా!, అప్రతిబంధలక్ష్మిని పొందిన వాడవు, అకీర్త్య ప్రతాపము లందు ఆస్థలేనివాడవు, ఆనంద స్వరూపుడవు, సమాధిలో నున్నవారికి ఆశింప దగిన వాడవు నైన నీవు భూమియందు నన్ను రక్షింపుము.



**వివరణము:-** నాలీ శబ్దము లడయోరభేదః అను సూక్తి ననుసరించి గడియను బోధించును. కాల ఖండవాచకమైన ఆ శబ్దము సమస్తకాలమునకు ఉపలక్షకమై శ్రీరాముని యందలి పారమార్థిక కాలానవచ్ఛిన్నతను సూచించును.

**అవతారిక:-** ఈ క్రింది ఋగ్వేద (10-3-3) వేదమంత్రమును శ్రీరామపరముగా వ్యాఖ్యానించుచు ఈ గ్రంథమును మంగళాంతము చేయుచున్నాడు.

**ఓం**
**భద్రో భద్రయా సచమాన ఆగాత్**
**స్వసృసారం జారో అభ్యేతి పశ్చాత్।**
**సుప్రకేతైర్ద్యుభి రగ్నిర్వితిష్ఠన్**
**రుశద్భిర్వర్ణై రభిరామ మాస్థాత్॥**

**పదవిభాగము:-** భద్రః-భద్రయా-స-చ-మానః-ఆగాత్, స్వసృసారమ్-జారో -అభ్యేతి పశ్చాత్-సుప్రకేతైః-ద్యుభిః-అగ్నిః-వితిష్ఠన్-ఉశద్భిః-వర్ణైః-అభిరామమ్-ఆస్థాత్

**ప్రతిపదార్థము:-** భద్రః=రామభద్రుడు, భద్రయా=మంగల(సీత)తో సచమానః=సంబధ్యమానుడై తండ్రి వియోగ వశమున అరణ్యమునకు, ఆగాత్=వెడలెను, పశ్చాత్=పిమ్మట, జారః=పరదారాసక్తుడైన రావణుడు, స్వసృసారమ్=చెల్లెలు లేక తల్లివంటి సీతను, అభ్యేతి=సమీపించెను (అపహరించెను), అగ్నిః =అగ్ని, సుప్రకేతైః=ఆకారమును హరించు, ఉశద్భిః=మనోహరములైన, వర్ణైః=ఆకార విశేషములతో, వితిష్ఠన్=నిలుచుచు, రామమ్=శ్రీరాముని గూర్చి, అభ్యాత్ =శుద్ధురాలని ప్రకటించెను (సీతను రామునెదుట నిలిపెను).

**తాత్పర్యము:-** సీతతో రాముడడవికి పితృవియోగమున పోయెను. అట రావణుడు చెల్లెలు వంటి సీతనపహరించెను. అగ్ని తనలో ప్రవేశించిన సీతను తన కాంతులతో రాముని యెదుట నిలిచి సీత పరిశుద్ధురాలని ప్రకటించుచు రాముని ప్రక్కన నిలిపెను.

**వివరణము:-** మంగల వాచకమైన భద్ర శబ్దము ఆదియందు గల ఈవేద మంత్రమొక్కటే అయ్యు రామ కథను మొత్తము సూచించినట్లు, తన ఒకే శ్లోకము సమస్త రామాయణ బోధకమని సూచించును. మంత్రమును తన గ్రంథము యొక్క అంతమున సహృదయ పాఠకులకు మంగళము కలిగించు నను కోరికతో కవిచే (పఠింపబడినది) లిఖింపఁబడినది.

**- ఇతి సంపూర్ణమ్ -**





వట్టిచెరుకూరు వాస్తవ్యులైన

**రావి వెంకట సుబ్బయ్య మరియు సీతారావమ్మ గార్ల**

ఆర్థిక సహాయముతో ముద్రింపబడిన ఈ

**‘మోహనరూపా’** వ్యాఖ్యాన గ్రంథము

**భద్రాచల శ్రీరామచంద్ర ప్రభు**

పాదములకు సమర్పితము

**త్వరలో....**

**మహాకవి కాళిదాస విరచిత**

# 'చి ద్గ గ న చ న్ద్రి క'

ప్రథమ ద్వితీయ విమర్శలు - మొదటి భాగము

తృతీయ విమర్శ - రెండవ భాగము

చతుర్థ విమర్శ - మూడవ భాగము

**దోర్బల విశ్వనాథశర్మ గారి**

# 'శి వా న న్ది నీ'

**(ఆంధ్రప్రతిపదార్థ-తాత్పర్య-విపుల వివరణ)**

**వ్యాఖ్యతో వెలువడనున్నవి.**

## సాధన గ్రంథ మండలి, తెనాలి.

1. మూకపంచశతి
   a) ఆర్యాశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - రూ. 25-00
   b) కటాక్షశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 15-00
   c) మందస్మితకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 15-00
   d) స్తుతి శతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 30-00
   e) పాదారవిన్మదశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా - 25-00
2. మహిషాసురమర్దినీ స్తోత్రమ్-అర్థతాత్పర్య వివరణ - 10-00
3. శివతాండవస్తోత్రమ్-అర్థతాత్పర్య వివరణ - 3-00
4. ఆత్మ విద్యావిలాసము-శ్రీ సదాశివ బ్రహ్మేంద్ర సర్వతులు
   తాత్పర్యము-శివకింకరుడు - 15-00
5. శ్రీశివమానసిక పూజాస్తుతి-అర్థతాత్పర్యములు - 10-00
6. సర్వేశ్వరశతకము పీఠికతో-యథావాక్కుల అన్నమయ్య - 4-00
7. శివస్తోత్ర కదంబము (32) - 15-00
8. శివమీడేస్తవః-హర్షిణీ వ్యాఖ్యా - 8-00
9. శ్రీహలాయుధ శివస్తోత్రమ్-డమరుక వ్యాఖ్యా - 20-00
10. చణ్డీశతకమ్-ప్రసాదినీ వ్యాఖ్యా - 30-00
11. హరిమీడేస్తవః-మచర్చికా వ్యాఖ్యా - 20-00
12. పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్-శివప్రియ వ్యాఖ్యా - 40-00
13. అమరుక శతకము-మనసిజ వ్యాఖ్యా - 20-00
14. బిల్వాష్టోత్తర శతనామస్తోత్రమ్-శివోల్లాస వ్యాఖ్యా - 10-00
15. శ్రీ సోమనాథ భాష్యమ్-పరిష్కరణ-శ్రీదోర్బల - 25-00
16. శ్రీ త్రిపురామహిమ్నః స్తోత్రమ్-శ్రీ నీరాజన వ్యాఖ్యా - 15-00
17. శ్రీ గుణరత్నకోశః-రత్నదీపికా వ్యాఖ్యా - 20-00
18. శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-1వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా -30-00
19. శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-2వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా -30-00
20. శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-3వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా -30-00
21. వేదమంత్రరామాయణమ్-బాలకాండ - 40-00
22. శ్రీ రుద్రనమకమ్-చమకమ్ - 5-00
23. అద్వైతానుభూతి-తాత్పర్యము-శివకింకరుడు
    శ్రీ సదాశివ బ్రహ్మేంద్రసరస్వతులు - 15-00
24. శ్రీరఙ్గనాథ సుప్రభాతమ్ - శ్రీసేవావ్యాఖ్యా - 15-00
25. శ్రీ గరుడదండకమ్ - సంస్కృతాంధ్ర వ్యాఖ్యాసహితమ్ - 10-00

శ్రీః

కఙ్కణబన్ధ

# ఏకశ్లోకరామాయణమ్

(వాసిష్ఠవంశజ కృష్ణమూర్తి ప్రణీతమ్)



**మోహనరూపా వ్యాఖ్యా**

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విపుల వివరణ)

దోర్బల విశ్వనాథశర్మ

**ప్రకాశకులు**

**సాధన గ్రంథ మండలి, తెనాలి.**

**వెల రూ. 20-00**



**కఙ్కణబన్ధ ఏకశ్లోకరామాయణమ్**

వాసిష్ఠవంశజ కృష్ణమూర్తి ప్రణీతమ్

**మోహనరూపా వ్యాఖ్యా**

(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విపుల వివరణ)

దోర్బల విశ్వనాథశర్మ

ప్రథమ ముద్రణ:- 21st April, 2002, Sri Ramanavami
చిత్రభాను సంవత్సర చైత్రమాసము - శ్రీరామనవమి

ప్రతులు : 1000
పేజీలు : 80
వెల రూ. : 20-00



DTP by
VIKRAM GRAPHICS
Opp. M.R.O. Office
CHIRALA - 523 155
Ph.: 08594 - 37658

Printed at
[illegible]
Naaz Complex, Station Road
CHIRALA - 523 157
Ph.: 33057, 30357






# ఉపోద్ఘాతము

ఏకశ్లోక (కంకణబద్ధ) రామాయణము సంస్కృత సరస్వతికి అపూర్వశబ్ద చిత్ర భూషణము.

కృష్ణమూర్తి నామునైన కవిచేత ఇది రచింపబడినది. బహుశః పదునెనిమిదవ లేక పందొమ్మిదవ శతాబ్దికి చెందిన వాడీ కవి కావచ్చును. కావ్యమున దాదాపు ప్రతి శ్లోకమున రాజును గూర్చిన సంబోధనములున్నవి. వానిని భగవత్పరముగ కూడ అన్వయింప వచ్చును. ఆ రాజు పేరు కూడ స్పష్టము కాలేదు.

అవసరమైన చోట్ల 'రల' లకు ('లళ' లకు) 'లడ' లకు, 'నణ' లకు, 'థధ' లకు 'శస' లకు అభేదము పాటింపబడినది.

శబ్ద చిత్రము కావున మరొక విధముగా ఆయా శ్లోకముల పద విభాగము ద్వారా అర్థమును సాధించు నవకాశము కలదు.

నేనెఱింగినంత వఱకు ఇట్టిది మరొకటి నా దృష్టికి రాలేదు. ఇప్పటికిది అపూర్వమని భావించెదను.

కొన్ని శ్లోకములలో శబ్దముల వలన కథ సూచింపఁబడుట మాత్రము జరిగినది. స్పష్టముగా వాచ్యము కాలేదు.

శ్రీరామ చరిత్రము ఆరు కాండల కథను చెప్పు ఒకే శ్లోకము అనులోమ విలోమముగా అరువది నాలుగు విధములుగా రూపుదాల్చునట్లు రచించుట అనితరసాధ్యము.

విబుధ హంసలు నీరక్షీరన్యాయమున కావ్యము యొక్క నా ఆంధ్ర వ్యాఖ్యానమును ఆదరించెదరని భావించెదను.

ముద్రణ యోగ్య శుద్ధ ప్రతిని వ్రాసి యిచ్చిన చిII దామోదరశర్మకు ఆశీస్సులు.

రామాయంపేట,
వృషమాఘశుక్ల త్రయోదశి,
25-02-2002

ఇట్లు
**దోర్బల విశ్వనాథశర్మ**

## దోర్బల విశ్వనాథశర్మ గారి
### వ్యాఖ్యాన గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 1. | మూకపంచశతి | | |
| | a) ఆర్యాశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | రూ. 25-00 |
| | b) కటాక్షశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 15-00 |
| | c) మందస్మితశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 15-00 |
| | d) స్తుతి శతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 30-00 |
| | e) పాదారవిన్దశతకమ్-సారోల్లాసినీ వ్యాఖ్యా | - | 25-00 |
| 2. | శివమీడేస్తవః-హర్షిణీ వ్యాఖ్యా | - | 8-00 |
| 3. | శ్రీహలాయుధ శివస్తోత్రమ్-డమరుక వ్యాఖ్యా | - | 20-00 |
| 4. | చణ్డీశతకమ్-ప్రసాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| 5. | హరిమీడేస్తవః-మచర్చికా వ్యాఖ్యా | - | 20-00 |
| 6. | పరశమ్భుమహిమ్నః స్తోత్రమ్-శివప్రియ వ్యాఖ్యా | - | 40-00 |
| 7. | అమరుక శతకము-మనసిజ వ్యాఖ్యా | - | 20-00 |
| 8. | శ్రీ సోమనాథ భాష్యమ్-పరిష్కరణ | - | 25-00 |
| 9. | శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-1వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| | శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-2వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| | శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్-3వ భాగము ఆస్వాదినీ వ్యాఖ్యా | - | 30-00 |
| 10. | సుధాలహరి-పండిత జగన్నాథరాయలకృతమ్-మారుతీ వ్యాఖ్యా | - | త్వరలో |
| 11. | చిద్గగనచంద్రిక - శివానందినీ వ్యాఖ్యా | - | త్వరలో |



ప్రతులకు
**సాధన గ్రంథ మండలి,** తెనాలి - 522 201

శ్రీః

కఙ్కణబన్ధ

# ఏకశ్లోకరామాయణమ్

**వాసిష్ఠవంశజ కృష్ణమూర్తి ప్రణీతమ్**



మోహనరూపా వ్యాఖ్యా
(ఆంధ్ర ప్రతిపదార్థ-తాత్పర్య-విపుల వివరణ)
దోర్బల విశ్వనాథశర్మ

**ప్రకాశకులు**
**సాధన గ్రంథ మండలి, తెనాలి.**
వెల రూ. 20-00